చపలుం డాతఁడు సేయుటా ? వినిన నీచందంబు నిందింపరే ?
రిపులోకం; బిటు గేలిసేసెదవె ? తీరే ? యిట్టిసంభాషణల్.

విరం— (తనలో) ఇతఁడు విపరీతముగా భావించినాఁడే ? (ప్రకాశము) కుమారా ! బృహన్నల కొక్క నాట్యవిద్యయందే పాండిత్య మనుకొంటివా యేమి ? మున్నర్జునుండు ఖాండవవనమ్ము దహించునప్పు డితఁడే చుమీ సారథ్య మొనర్చినవాఁడు !

అర్జు.— (సమీపించును)

ఉత్త— (తనలో) సైరంధ్రియనఁ గడుమాన్యురాలు. ఈమె యసత్య ముచ్చరింపదు. (అర్జునుదిక్కై ప్రకాశము)

ఉ. కౌరవసేనతోఁ గలిగెఁ గయ్యము నేఁటికి నాకు, దానికిన్
సారథి లేమి నట్టునిటు సందియమున్ గనుచుండ నంత నీ
పేరు వచించె నీయతివ పేడితనంబున నింత నేర్చితే ?
వారక సారథంబు కడపన్ బని పూనెదవే ? బృహన్నలా !

ఆ. వె. గాయకుండ వంచు గారవింతుమె కాని
నీవు యుద్ధమునకు నేర్పరివని
యెఱుఁగ; మింక నేమి ? యిప్పు డెఱింగితి
మనసరంబు గలిగె నదియుఁజూడ.

అర్జు.— (తనలో) పగఱ నిర్జించుటకుఁ దగినసమయము వచ్చినది. అందుల కియ్యది నాందిగాఁ బరిణమించుఁగాక. (ప్రకాశము) కుమారా ! నా కెందును విశేషించి ప్రవేశములేదు. మీయొద్ద నునికింజేసి యవసరమైన తఱి వెనుదీయుట పాడిగాదని యిందులకు సమ్మతించుచుంటి.

ఉ. చిన్నతనమ్మునందుఁ గృషిచేసితి నించుక గానవిద్య యం
దు న్నటనంబునందును ననుంగులు కొందఱుగూడి తేరినే
ర్పు న్నెఱి నేర్చుచుండఁగ "నృపుల్ కడు మన్ననఁజేతు" రంచు నా
చిన్నెయుఁ గొంత నేర్చితి విశేషములంతగ నేర నెయ్యెడన్.

ఉత్తర— (చనవుగా) అన్నా ! ఇమ్మహాత్ముఁడు గానమునందుఁ దనకెంత ప్రజ్ఞయున్నదో సూతకృత్యమునందును నంత ప్రజ్ఞయున్నదని సూచించుచున్నాఁడు కావున నఖండప్రజ్ఞ యున్నదనియే మనమనుకొనవచ్చును.

ఉత్త— (గౌరవముగా) నీవినయమునకు మేము సంతసించితిమి. నీవు సన్నద్ధుండవై తేరి నాయత్తపఱచి యిటు తోడితెమ్ము.

అర్జు.— మంచిది. (నిష్క్రమించి తేరితోఁ బ్రవేశించి) కుమారా ! ఇం దధిరోహింపుము.

ఉత్త— (ఎక్కటనటించి)

చ. దురముగఁ ద్రోలుమీ రథము ద్రోహులుకౌరవు లేగకుండఁగన్
దతిమి వధింపఁగావలెఁ బదంపడి గోవులఁ గ్రమ్మఱించి స
త్వరమున వచ్చి తండ్రియుఁ బ్రధానులు మెచ్చుకొనంగఁ బ్రోలి న
చ్చెరువున ముంపఁగావలయు శ్రీయు యశంబును గాంచఁగావలెన్.

అర్జు— ఇదిగోఁ ద్రోలుచున్నాఁడను.

ఉత్తర—అన్నా ! నీవ క్కురువీరుల జయించి వచ్చునప్పుడు నానావిధమ్ముల
లును ననర్ఘమ్ములును నగు వారల యుష్ణీషాంచలమ్ములు బొమ్మపొత్తిక
లకుఁగా నాకై తేవలయు.

ఉత్త— (ఆదరముతో) తప్పక యట్లొనరింతును.

సైరం— (తనలో) అజ్ఞాతవాసవత్సరము గూడఁ బూర్తికావచ్చినది. ఇఁక
నెవరెఱిఁగిన నేమగును ? (ప్రకాశము) కుమారీ ! తేరప్పుడే దూరమరిగి
నది; మన మంతిపురికిఁ బోదము.

(నిష్క్రమింతురు.)

అర్జు— (నిరూపించి)

మ. అదె కన్గొంటివె ? కౌరవేంద్రుబల మల్లాతండె రారాజు, బ
ల్లిదులౌ మేటి మహారథుల్ తదితరుల్ లెక్కింపఁగా రాక యె
ల్ల దెసల్ నిండిరి వారిఁజూచితివె ? నీలాభ్రల్ల శోభిల్ల న
భ్యుదయమ్మందుము వీరలన్ గెడపి మాతోన్ సర్వోర్వీధనుం డుబ్బఁగన్.

ఇంతకన్నను నెక్కుడు వేగంబునఁ దేరువోవనిచ్చినంగాని వారలం
గలసికొనఁజాలము. (రథవేగమును హెచ్చింపఁబోవును)

ఉత్త— (తేజిపాఱఁజూచి భయముతో)

ఉ. కౌరవనాథుసేన యనఁగా నిదియా ? పొరపాటు చేసితిన్
వీరవరేణ్యు లియ్యెడల వేలకునే, ల్భటసంఘమన్ననో
ధారుణి యీనినట్లె మదిధైర్యము చాలదు వెన్కప్రక్కకున్
దేరు మరల్పుమా తగుగతిన్ బొనరింపఁగ వచ్చుఁ బిమ్మటన్.

అర్జు— (తనలో) ఏమీ ! యీకొమరుఁడు చూచినంతనె భీతిల్లుచున్నాఁడే !
(యోజించి) లేక నాధైర్యము కనుఁగొనుటకై యిట్లనియుండునా?
(ప్రకాశము) రాజనందనా !

శా. నన్నుం గేలి యొనర్చుటో ? నిజముగా నాశక్తి వీక్షించుటో
చన్నే ? రాజకుమారు లిట్లువలుకన్ జన్యంబులన్ జూడమే ?

యెన్నండుఁ గనలేదు మఱి వినఁగలే దీలాటిచందంబు నె
న్కన్నిబోఁటులు చూతురే? సమరముఁ గావింప నేతెంచియుఁ.

ఉత్త— (పారిభవముతో) ఏమీ! బృహన్నలా! యుద్ధములు నీవేచూచితివా? మేము చూడలేదా? నీకదియంతయు నెందులకు? ఎందుకువచ్చితివో యాపని నెఱవేర్చుకొనుము. అధిక ప్రసంగము గట్టిపెట్టుము.

అర్జు- (తనలో) ఏమీ! ఇతని ప్రాగల్భ్యము (ప్రకాశముగా) ఇదిగో నాపని నెఱవేర్చుకొనుచున్నాఁడను. (రధమును వడిగాఁదోలును)

ఉత— (కోపముతో) ఏమీ! నాతోనీవు నెకసక్కెమా? ఒకటిచెప్పిన నొకటి చేసెదవుగా?

అర్జు— (శాంతముగా) రధచోదకత్వము నాపని. అది నెరవేర్చుట తప్పా?

ఉత— (కోపముతో) ఓహో! ఇట్లయిన బాగుగనే జరుగును. ఇఁకనేని నీ కొంటెతనము గట్టిపెట్టి రధము వెనుకకుఁ ద్రిప్పుము.

అర్జు- (తనలో) ఇతఁడు నిజముగానే భయఁపడినాఁడు! కావున నితనికి ధైర్యము చెప్పిచూచెద. (ప్రకాశము)

ఒక్కఁడు పెక్కు సేనలను నుక్కడఁగించుట యొక్కవీరునిఁ
బెక్కురు గూల్పలేమి పృథివిఁ గలయట్టిదె "వారు పెక్కు రే
నొక్కఁడ" నంచు భీతిఁబుట యొప్పునె? నీవె జయింపవచ్చు వా
రుక్కడఁగంగ వచ్చు నిటు లోడుట పాడియె? రాజనందనా!
మఱియొక లాగు భావింపక నావచనంబుల్లు వినుము.

ఉ. రాజననేమి? క్షాత్రవపరంపర వచ్చుటో? లేక చచ్చుటో?
నాజనన ప్రయోజనమునాఁ జనువాఁడె చుమీ కుమార! నీ
వాజికి నోడితేని భవదంబయుఁ దాతయు సాటివారి నే
యోజ శిరమ్ము లెత్తి కననోర్తురు? మార్తురఁ జంపనెంచుమా!

ఉత్త— (తనలో) ఇతఁడు క్లీబుండయినను మాటలు గడుఁ బౌరుషోచితముగాఁ గనుపట్టుచున్నవి. అక్కటా! యెంతదుర్దశ వచ్చినది! ఒక నపుంసకుఁడు నాకు ధైర్యము చెప్పువాఁడా? అయినను నితఁడె వఁడో యొకింత కనుఁగొనవలయు. (ప్రకాశము)

గానముగాదు నాట్యమును గాదభినీతియుఁగాదు యుద్ధపుం
బూనిక లేద? యక్కట! నపుంసకులేడ? విశేషపౌరుషా
ధీనులమైన మేమె వెనుదీయుదు మొక్కకచోఁబరుఁ దగం
గా నెఱుఁగన్వలెఁ బిడపఁగయ్యమొ నెయ్యమొ సేయఁగావలెఁ.

రాజనీతియనఁగడు దుర్ూహంబు. దాని నెఱుఁగుట సామాన్యంబు కాదు. ఎవరి బలమును దనబలమును నెఱుఁగక కడంగువాఁడు వృథాగా మానప్రాణమ్ములకుం దప్పు. ఇది యంతయుఁ గేవలము నాసంరక్షణకే కాదు.

ఉ. సారథిఁ జంపియే రథికుఁ జంపుదు రింతయెఱుంగ వొక్కొ? ని
న్నారక నేను దీసికొని యుద్ధమునన్ బలియిత్తు నేని మా
పౌరులు నన్ను దూఱరె? కృపారహితుం డని, నిన్నువంటి వి
ద్యారుచిరుండు గానమున కబ్బునె? యుత్తరకింక నొజ్జగన్.

అర్జు— (తనలో) ఏమి? యీతని యుపన్యాసము. (ప్రకాశము) నృపకుమారా! ఎందులకుఁ గొఱగాని యీ పేడిబ్రతుకుకన్న నాకుఁ జచ్చుటయే కొంతమంచిది. అదిగాక చావెన్నటికేని దప్పనిదే. ఇట్టి మహాకార్యంబునఁ బ్రాణపరిత్యాగంబు శ్లాఘ్యంబుకదా! నాకై నీవు సంశయింపకుము. ఇది యిట్లుండ నీవంటి రథికశ్రేష్ఠునిచేఁ గాపాడఁబడు నాకు మాత్ర మేమిభయము? ఆత్మను సారథిని నశ్వములు మొదలగు వానిని సంరక్షించుకొనువాఁడే కదా రథారోహణమున కర్హుఁడు!

ఉత్త— (తనలో) ఇతఁడు దేనికిని నొప్పకున్నాఁడు. వీని యభిప్రాయము నిజముగా నిట్టిదే యైయుండవచ్చును. రూపు చూచిన పేడి, మాటలు చూచిన నెట్టిశూరులకును బైపెచ్చు. ఎట్లేని తేరు మరలింపవలయు. లేదా! ఇఁక బ్రతుకుపై నాస వదలవలయు. (యోజించి) చెప్పిన చొప్పున వర్తింపని యనుచరుఁ డుండుట కడుముప్పుగదా! కానిమ్ము. ఇట్లు చెప్పిచూచెద. (ప్రకాశము) నీ ధైర్యస్థైర్యమ్ములు చూచిన నాకుఁ గడునచ్చెరువుగా నున్నది. ఎందుకైననేమి? నే నీ సంగరమ్మునకుఁ బూననేరను. నీకంత ధైర్య ముండెనేని నీవు రథివై కార్యంబు నిర్వహించెదవా? లేక నా చెప్పిన చొప్పునఁ దేరు మరలించెదవా?

అర్జు— కుమారా! యెవరికృత్యము వారు నెఱవేర్చుకొనవలయును. కావున నొక్కింత దిట్టము గలిగి వర్తింపుము.

క. కురుసేన గాదు దేవా
సురలెదిరించినను నీవ చొరవ గలిగి నేఁ
డఱిముఱి నోడించెద వే
నెఱుఁగుదు నీకట్టికాల మిపు డరుదెంచెన్.

(రథము దురముగాఁ దోలును.)

ఉత్త— (తనలో) ఏమి యీరథవేగము! అప్పుడే చాలదూరము వచ్చితిమి. (తేఱిపాఱఁజూచి భయముతో) అమ్మయ్యో! దగ్గఱకు వచ్చినకొలఁదిని సైన్య మెంతభీకరముగానున్నదో! ఈ మూర్ఖుఁడు నేనెంతచెప్పినను వినునట్లు తోఁపదు.

ఆ. వె. అకట! "డబ్బునెట్టి యాబ్దికముగొన్న
సగిది" వీఁడు నాకుఁ బ్రాప్తమయ్యె
వీణపట్టె కాని వింటిపట్టెఱుఁగని
కాంత కెఱుకపడునె? కదనబాధ.

కానిమ్ము, వీని కా కౌరవులే చెప్పవలసినరీతిని బుద్ధిచెప్పుదురు గాక. నేను జెప్పి చూచిన లాభములేదు. వీనికిం దెలియకుండ నిందుండి యుఱికి పాఱిపోయెద. (అట్లొనరించును)

అర్జు— (చూచి ఆశ్చర్యముతోఁ దనలో)

మ. అకటా! నీచునితోడ వచ్చితిఁగదా! హాస్యాస్పదుం డిట్టి పూ
నిక కేమంచుఁ గడంగె? రాచకొలమేనిన్ లోన శంకింప కూ
రక పాఱెన్ వెసఁ దేరు డిగ్గి యిది వీర వ్రాతముల్ విన్నచో
నెకసక్కెంబగుఁగాదె? క్రీడియుఁ గలం డిం దంచు నిందింపరే?

నేఁడు గాకున్న రేపేని బృహన్నల యర్జునుఁ డని లోకులకుఁ దెలియదా? ఇం దుపాయమేమి? (యోజించి) ఇట్లగుఁగాక. నేనువెంటఁ జని యక్కుమారుని బోధించి సారథిం జేసికొని యేను రథినై విరటుని ఋణముం దీర్చెద. (పాఱఁజూచి) అరుగో భీష్మద్రోణాదిమహావీరు లందఱును నిక్కడి విశేషములన్నియుఁ గనిపెట్టుచు వారిలో వారేమో చెప్పికొనుచున్నట్టు లూహింపనయ్యెడిని. కానిమ్ము.

(నిష్క్రమించును)

(అంతట భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణులును, దుర్యోధనుఁడును బ్రవేశింతురు)

దుర్యో— (పాఱఁజూచి) ఓ రథికవరులారా!

మ. పసులం బట్టితి మేగుచుంటిమి కడున్ బాగాయె గోపాలకుల్
వెసమైఁ బోయి వచింపఁబోలు నెవఁడో వీరుండు తేరెక్కి పెం
పెసలారన్ జనుదెంచి స్యందనము నందే డించి భీతిల్లి యే
గు సడిన్ గాంచితిరే? యితం డెవఁడొకో? కొంతేని నూహించిరే?

అంతటిశూరుఁ డెవఁడైన నేమి? ఇందుల కీ విచార మెందులకు?

కృపా— అంగరాజా! అట్లు నిరసించి మిన్నకుండుటకన్న జాగరూకత కలిగి వివేకించుట మంచిపని కదా? చిన్న పామునైన పెద్దకఱ్ఱతోఁ గొట్టవలయును.

ద్రోణు— రాజా! అతఁ డెవరనియా? నీ విచారణము కడు మాననీయము. నాకుం దోఁచిన తెఱఁగు వినుము.

ఉ. కౌరవసేనపై కొకఁడుగాఁ జనుదెంచుట కెవ్వఁ డోపు నీ
ధారుణిఁ గౌరవాన్వయుఁడె తప్పక కావలయున్ బశువ్రజం
బేరిని గోరి పట్టితిమొ యీపురి వారలయున్కి నిక్కమం
చారయనయ్యె నర్జునుఁడె యాతఁడు సందియ మంద నేటికిన్?

కర్ణు— (ఏకపక్షముగా) మీ రర్జునుం జూచి చిరకాల మగుటచే శిష్యప్రేమ మీ కట్టి యూహ జనింపఁ జేయఁబోలు. లేక,

ఉ. స్యందన మం దెడించి వెలుచన్ బరుగెత్తిన గుర్తు చూచి మీ
రం దటివాఁడు పార్థుఁ డని యాడితి రర్జునుఁడైనఁ దోడుతో
డం దరళత్వ మూనునె? కడంగఁడె? పోరి కొకించుకేని యా
పంద యెవండొ ఫాల్గునిఁగ భావన చేసితి రేటి కేరికిన్.

కృపా— అంగరాజా! వారివాక్యము తుదముట్ట విని నపిమ్మటఁ జెప్పఁగూడదా?

అశ్వ— (ఏకపక్షముగా) అట్లు విని చెప్పినచో నాతఁడు ప్రభువునకు ముఖ్యమిత్రుఁ డని యెట్లు వెల్లడియగును?

దుర్యో— (భీష్మునుద్దేశించి) తాతా! వీర లందఱును నేమేమో యభిప్రాయము లిచ్చుచున్నారు వింటిరి కదా? మీ యభిప్రాయ మేమి?

భీష్మ— ఎవఁడేనియు నొకప్పుడు గాకున్న నొకప్పుడేని నీకు నచ్చఁజెప్పఁగలఁడు గాని రాధేయునకుమాత్రము చెప్పలేరు. అతఁడు తప్పక యర్జునుఁడే. సందియములేదు. కారణము లింకను ధనురాచార్యులే చెప్పఁగలయున్నారు. అంతలో నీతఁ డుత్ప్రేక్షకు మొదలిడెను.

కర్ణ— (ఏమో చెప్పఁబోఁగా)

దుర్యో— (వారించి) ఆచార్యా! తమయభిప్రాయము సాంతముగా సెలవిండు.

ద్రోణు— ఎవరు చెప్పుట కేమున్నది?

ఉ. ఇంతకు మున్న విన్నయదియే కద కీచకుచావు; భీము వి
క్రాంతికి సాక్ష్యమిచ్చెనది, కవ్వడి యీతఁడు గావుఁ జెల్ల మీ

కంతట నింతటన్ దెఱియు నల్లదె వచ్చుచునున్నవాఁడు ది
క్ప్రాంతములెల్ల నిండె నది యాతని శంఖపుమ్రోఁత భూవరా!

(అందఱును వినుట నటింతురు)

కర్ణ— (తనలో) అవును. ఆధ్వని దేవదత్తధ్వనివలెనే యున్నది.

దుర్యో— గురువరా! సందియముం దీర్పుఁడు.

మ. తమకున్ శిష్యుఁడు గౌరవాన్వయజుఁ డంతర్వాణిమాన్యుండు వి
క్రమపారంగతుఁ డింద్రనందనుఁడు పోరన్ వచ్చుటే నిక్కమం
దము వీరుం డతఁ డేల వెన్కఁజను మానంబేది సైన్యంపుసం
ద్రము వీక్షించినఁ బౌరుషం బధికమై దైవారదే క్రీడికిన్?

ద్రో— చ. వెనుకకు నెందు కేగెనొ వివేచన సేయఁగ రాదు గాని య
ర్జునుఁ డనుమాట నిక్కమిఁక పోరికి నెక్కుడువాఁ డెవండొ యా
తని నని నోర్చుఁగాని విదితంబె లదన్యుల కోర్వరామి యా
లను గడు వేగ నంపుము బలమ్ములఁ దోడుగ నిచ్చి భూవరా.

దుర్యో— (సంతోషముతో) అతఁ డర్జునుఁడే యైన మన కార్యము ఫలించినదె.

క. మనలఁ బదిరెండు సంవ
త్సరములు వని నుండి యొక్క సంవత్సర మీ
సరుసఁ జరియించి రావలె
నరుఁడే యతఁడంచు మీకు నమ్మిక యేనిన్.

భీష్మ— (తనలో) అక్కటా! వీనికౌటిల్య మెన్నఁటికిని బోవదయ్యెఁగదా! మంచిది. (ప్రకాశము) కుమారా! పదుమూఁడుసంవత్సరములును నిన్నఁటికే నిండినవి. లేదే యనుకొందము.

ఉ. పాలడుగంగ నర్జునుఁడు వచ్చినచో నిటులాడ వచ్చుఁ దా
నాలకునై విరాటు భటుఁడైకద రావలె? నిప్పు డందుకై
యాలము నేఁతకుం గలదె యడ్డము? పిమ్మటఁ జూచుకొంద మా
కాలగణాధకున్ దొరయఁగా దొరలెవ్వరొ? యేర్పఱింపుమా!

దుర్యో— (తనలో) అప్పుడే యీముదుసలి పాండవపక్షపాతముం జూప మొదలుపెట్టినాఁడు. (ఆలోచించుట నటించును)

కర్ణ— (ఎకసక్కెముగా) ఏమీ! నిజముగా నతఁ డర్జునుఁడేయైన నతనిని మార్కొనువారే లేరా?

చ. అతనికె కాక యందఱికి నస్త్రగురుండు ఘటోద్భవుండు నీ
వతులితవిక్రముండవు మహాహవదక్షుఁడ విట్టిమీకును

ప్రతి గురుపుత్రుఁడుఁ గృపుఁడు పాండవపక్షముఁ బూని వీరు నీ
చత మతి రోయరే నతనిజంపుట కేనొకరుండఁ జాలుదుఁ.

అశ్వ— (పరిహాసముగా) నీవు చాలినదియు లేనిదియుఁ బాంచాలీపరిణయం బును ఘోషయాత్రయును సంపూర్ణముగా నెఱుఁగుదు. దానికేమి ? (సుయోధనుదిక్కు) నరేంద్రా! ఇంతకును నతఁ డర్జునుఁడా కాఁడా యనునది వివాదాంశము. నిక్కముగా నర్జునుఁడే యైనను విరటు ననుచరుం డగుకతన మనము మున్నొనర్చికొన్న సమయ మతని కిప్పట్టునఁ బ్రతిబంధకము గానేరదు. ఏమందువా ?

శా. న్యాయం బంచునో యేమి హేతువుననో నాతండ్రియు న్నేను గాం
గేయుండుఁ గృపుఁడు న్నిరంతరముఁ దత్క్షేమంబ కామింతు మిం
తే యహా నిక్క మటైనఁ బరులయాదేశంబునం దుంటఁ గా
దే ? యేదుష్కృతికైన సిద్ధముగ మే మిందుంటిమో భూవరా !

చ. విరటునిగోవులఁ వృథగ వీరులమం చొకపేరు పూని ని
ష్కారణులమై హరించుటయ కాక నిరాగసులైనగోపబా
లురఁ బడమోఁదు టెవ్వరును లోకులు మెచ్చెడి మేటికర్జమే ?
నరులు పరానువర్తులు పొనర్చని దుష్కృతు లున్నె ? భూవరా !

కర్ణ— (కోపముతో) అంతతోఁ గట్టిపెట్టుము. నీ యుపన్యాసమునకు ఫలితార్థ మతఁడు పరాధీనుఁడు గనుక నతని కిప్పట్టున సమయాభంగ విచారణం బనావశ్యకమని తేలినది. (దుర్యోధనునిదిక్కు) మిత్రమా! వీరలహృదయము నీకు స్పష్టముగాఁ దెలిసినదిగదా ?

ఉ. పోరికి నిట్టివారిఁ గొని పోవుట హానికరంబు వీరు స
ద్వీరులు గారు కోపకుని వేరము దీరుప లేరు; శత్రులన్
శూరులు పెద్దఁగాఁ బొగడఁ జొచ్చిరె ? యాచనగాఁ దలంచెనో
పాటుఁ దితండు ? యుద్ధపుస్వభావ మెఱింగిన నిట్టులాడునే ?

" తాఁజెడ్డకోఁతి వనమెల్లఁ జెఱచిన " దన్నట్లు తనకుఁదాను స్వతంత్రుఁడుగాని తక్కినవారిం గూడ నిరుత్సాహులఁ జేయుట యెందులకో? అగుఁగాక నీవు సంశయింపకుము.

ఉ. అర్జును లెక్కయే మఱెనియబ్బ సురేశ్వరుఁ డౌను గాక వి
స్ఫూర్జితశక్తిమై నెదిరి పోరి జయింపఁ గలాఁడ నూరకే
గర్జిలుపాటిగా దిపుడె కాంచెదు నాదుపరాక్రమంబు నీ
తర్జనభర్జనల్ కని యెదన్ భయ మందఁడు కర్ణుఁ డెన్నఁడున్.

కృపా— పృథాగా నెందులకు వాగ్వ్యయ మొనరించెదవు ? మనలో మనము మంచిచెడ్డలు చెప్పికొనుటయు నొకతప్పా ? పైకి నవసరానవసరములం

బట్టి మన మెట్లు సంచరించుచున్నను మనస్సుమాత్రము న్యాయము పరిక్కను ములుసూపక మానదు.

ఉ. ద్యూతములోన గెల్చుటది దోసమటంచుఁ బ్రపంచ మెంచు నో
సూతతనూజ! దాని విని శూరతఁ దెచ్చుకొనం బనేమి? దు
ర్నీతిని లోకముల్ బొగడునే? యటు సేయఁగ బ్రహ్మశక్యమే?
మూతి బిగింతు వేరిపయి? మాధులె, వీరలు నీకుఁజాలరే?

కర్ణు— (పండ్లు గొఱికి ఏమోయనఁ బోవుచుండ దుర్యోధనుఁడు వారించును)

అశ్వ— (ఎకసక్కెముగా) రాజా! ఎందులకు వారించెదవు?

క. వారింపనేల? యాతని
శూరత వాక్కులనె కాదె? చూడం దగుఁ "దా
నే రాజ" నవెడిగర్వ
ప్రారంభం బితని నింతవఱకుం దెచ్చెన్.

ఉ. వచ్చుచునున్న వాఁ డమరవంద్యపరాక్రమధూర్వహుండు వి
వ్వచ్చుఁడు మాటలన్ జనెడివాఁ డతఁడెన్నఁడు గాఁడు మాపయిన్
మచ్చరమేల యీతనికి? మా కతఁడన్నను గౌరవంబు లే
దిచ్చట; శత్రువైన వచియింపఁ దగున్ గుణమందు రేకదా!

కర్ణు— (కోపముతో) నీవంటి కుక్షింభరులకు గౌరవమున్న నేమి? లేకున్న నేమి?

ఉ. పాఱెడువారు కావుననె పాఱులు మీరలు మిమ్ము బోఁటులన్
బోరికి వెంటఁబెట్టుకొని పోవుట "పిల్లినిగొంచుఁ బెండ్లియిల్
చేరుటవంటి" దూరకొనఁ జెల్లదె తేనిమనంబునిట్లు కం
గా రొనరించునట్టి పనికా యిటకున్ రథమెక్కి వచ్చుటల్?

అశ్వ— (కోపముతో) ఓరీ! జాల్మా! ఏమని ప్రేలితివి? ఇదిగోఁ జచ్చితి విరా! (కర్ణునిపై కుఱుకఁబోవును.)

ద్రోణు— కుమారా! ఊరకొనుము. ఎందుకేని యసమానునితోఁ బ్రసక్తి గూడదు.

కర్ణు— (ధైర్యముగా) రమ్ము. అంతలో శాంతించితివేమి?

ఉ. ఆలము సేయువానివలె నాయుధముం గొని సారెసారె మీ
సాలను దువ్వుకొంచు నృపసత్రమునం బడి మెక్కి మెక్కి పైఁ
గాలమువచ్చినప్పు డిటు కాతరతన్ గని 'తిన్నయింటివా
సాలను లెక్కవెట్టు' నినుఁ జంపి కురుప్రభు నప్పు దీర్చెదన్.

అశ్వ— (కత్తి వెతికి) ఓరీ దుర్జనమూర్ధన్య ! జఘన్య!

శా. కందాలోఁ బడి భుక్తశేషమును జక్కన్ మెక్కి బల్వెక్కి యో
నిం దుర్ణీతికిఁ ద్రిప్పనీబ్రతుకు నేనే కాదు లోకంబులో
నిందన్ జేయనివార లుండ రిదిగో నీచావు దాపయ్యె నో
పందా! నోటికి బుద్ధిచెప్పుకొనుమా పైపైకి రాఁబోకుమా.

కర్ణ— (అశ్వత్థామపై కుఱుకఁబోవును)

దుర్యో— (వారించి) మిత్రమా ! ఇప్పుడు నీవు శాంతించి నాయందలి విశ్వాసమును జూపవలయును. (ద్రోణునిదిక్కై)

ఉ. మీ కిది న్యాయమే కద ? యమేయపరాక్రము లయ్యు శత్రునిన్
వాకొని పెద్దఁజేసి యిటు వారికివీరికి వాదు గూర్తురే ?
సాఁకినవాని ద్రవ్యము విసంబె ? యసంబున కాసఁజేయరే ?
నా కవమానమైనఁ గదనంబున మీకుఁ బ్రశస్తి గల్గునే.

భీష్మ— కుమారా ! ఇందు ద్రోణాదుల తప్పిదంబు లేశంబును లేదు. కర్ణుఁడు తనకుంగల పరాక్రమాతిశయంబు ప్రకటించె. దానికేమి.

క. ఆర్యులు కదనంబులఁ గడు
ధైర్యస్థైర్యములు గల ప్రధానులు వీరల్
కార్యాకార్యజ్ఞులు దు
శ్చర్యులె ! యివ్వారి గేలిసలుపన్ దగునే.'

అర్జునుండన సామాన్యుండు కాఁడు. అతఁడొక్కఁడేకదా, యని మన మొప్పరికింపంజన దనుట మన క్షేమమునకే కాని వేఱొండు కాదు. కావున వారలం బ్రసన్నులం జేసికొని కార్యంబు నెఱవేర్చికొనుము. (ద్రోణాదులదిక్కై)

ఉ. దగ్గఱవచ్చె నల్లదె పృథాసుతుఁ డందన మార్యులార! మా
యొగ్గుఁ దలంపఁబోక యిటకెందుకు వచ్చితి మట్టికార్యమున్
నెగ్గఁగఁజేయుఁడీ ? విజయునిన్ జిరకాననవాసజాతరో
షాగ్నిని నుగ్రతేజు నెటులో మనమాఁపుద మెల్లభంగులన్.

(దుర్యోధనునిదిక్కై) కుమారా! నీకర్ణుని సహాయునింగాఁ గొని పసులవెంబడిం జనుము.

దుర్యో— (కర్ణసహితముగా నిష్క్రమించును.)

(అంత నర్జునుఁడు స్వస్వరూపముతో నుత్తర సహితముగఁ బ్రవేశించును.)

(ద్రోణాదులందఱును బ్రసన్నులై సన్నద్ధులగుదురు)

అర్జు— (నవ్వి) ఇంకను నీకు సంశయము బాధించుచునే యున్నదా ?

సీ. కంకుండునా నిరాతంకుండు మాతండ్రి
ప్రియమిత్రుఁడతఁడు మా పెద్దయన్న
వలలుండు కీచకవనవహ్ని మాబాన
సీఁడెవ్వఁడతఁడు మా చిన్నయన్న
వారువంబులమీఁది పారుపత్తెమున క
ర్తాండు దామగ్రంధి యొక్కతమ్ముఁ
డాలఁగాచెడివారి కధినాథుఁ డల్లతం
త్రీపాలుఁడే సహదేవుఁ; డేన

తే. గీ. యర్జునుండను సైరంధ్రియాజ్ఞసేని
గాండివం బియ్యదియె సురేంద్రుం డొసఁగిన
మకుట మిద్దియె యే నపుంసకుఁడ నగుట
యూర్వశీశాపమునఁ జుమ్ము యుత్తరుండ !

శాపావసానం బగుటంజేసి మరల నారూపునాకు వచ్చె. భీమసేనాదుల యాయుధమ్ములు నీవు శమీవృక్షమ్మునఁ జూచి యుంటివి. మఱియును నీవడిగిన ప్రశ్నంబుల కెల్ల నుత్తరం బిచ్చితి; నిఁక నీవు లేశమ్మును జంకుఁ గొనక సారథ్యమానం దప్రమత్తుఁడవై వర్తింపుము. రథవేగంబు హెచ్చింపుము.

ఉత్త— చిత్తము. అట్లే యొనర్చెదను.

క. నరుఁడ వని నిన్నెఱింగిన
తరుణమునవ పోయె నాయెడం గలభయ మో
కురువీర ! యెఱిఁగి యెఱుఁగక
విరచించిన తప్పులకును వేఁడెద నిన్నున్.

అర్జు— అట్టి సందియము నీమనమ్మున నుంచకుము. తేరు పోవనిమ్ము.

ఉత్త— ఇదిగో ! తోలుచున్నాఁడను. (అట్లొనర్చును.)

అర్జు— (చేతితో నిర్దేశించి) నృపకుమారా ! అటు చూడుము.

శా. ద్రోణుం డాతడుఁ భీష్ముఁడల్లతఁడు కర్ణుండాతఁడే చాపని
క్వాణంబుల్ వినవచ్చుచున్నవియె ? యశ్వత్థామనూ! యాతఁడా

స్థాణుం బోలినవాఁ డతండె కృపుఁ డాచార్యోపమానుండు పై
రాణించుక్ ధ్వజమందు వ్యాళి మతఁడే రారాజు కన్గొంటివే.

ఉత.— దగ్గఱకు వచ్చితిమికదా! ఇంకను వీరు మనపై నారాచమ్ముల నిగుడ్ప రేమి?

అర్జు— ఏమనియా?

శా. ఆచార్యుండు నియంత యాయనకు నాయం డెంతయో పేర్మి స
త్యాచారుండగు భీష్ముఁడోలి మము బాల్యంబాదిగాఁ బెంచె ద్రో
ణాచార్యాత్మజుఁ డేను సోదరుల మన్నట్లుండు మ ద్దక్షు మా
కాచార్యత్వము చేయుటక్ గృపుఁ డుపాధ్యాయుండె యౌ నుత్తరా!

మ. ఒకకర్ణుండు సుయోధనుండు మనపై నుగ్రత్వముం బూని కొం
డికనాఁడాదిగఁ గీడు రోయుదురు కానీ వీర లయ్యార్యులక్
గికురింపం దగ దౌఁ గదా! మనము ముక్ గీలింతు మేనిన్ శర
ప్రకరం బార్యులు నింతు రంతనఱుక్ బై రారు వా రుత్తరా!

(పాఱఁజూచి) సుయోధనుండు గడుదవ్వునఁ బసులనెంటఁ జనుచున్నవాఁడు. కావున మనమియ్యెడ నున్నఁ బ్రయోజనములేదు. మన తేరిపక్కగా నతని యెదుటికిం గొనిపొమ్ము.

ఉత.— అట్లనే పోనిచ్చుచున్నాఁడను.

అర్జు.— (యోజించి) క్షణ మిక్కడనే యుండనిమ్ము. (తనలో)

క. వీరియెడ నాకుఁ గలిగిన
గౌరవముక్ జూపవలదె! కలదే! గురుధి
క్కారము శ్రేయస్కరమే
నారాచమ్ములనె వీరి నారాధింతుక్.

(కొన్ని యమ్ములు విడిచి) ఉత్తరా! తేరు నను కఁ జెప్పినచోట్లఁ బోవనిమ్ము.

ఉత్త— చిత్తము.

(ఇరువురును నిష్క్రమింతురు)

ద్రోణా— (సంతోషముతో)

శా. ఔరా! శిష్యుఁడ వన్న నీవకదరా! యాచార్యసద్భక్తి నీ
దేరా! నూర్గురు శిష్యు లుండవలెనే? యీ వాక్కుఁడే చాలు జ

న్మరాతికిన్ గురునాఘుఁ గొల్చు గురుపై నన్నన్న! కోపింప కి
ట్లారాధింతువె? దీనికిన్ ఫలము నీ కాఁగాక శీఘ్రమ్ముగన్.

(పట్టరాని సంతోషముతో భీష్ముదిక్కై) చూచితివికదా! మన
యెడల నాతఁ డొనర్చిన గౌరవము.

తే. గీ. స్వాగతమునకు రెండేసి సాయకములు
శ్రవణములుసోఁకి సోఁకనిసరణి నించె
వందనమ్మున కట్టులే నైచె పాద
యుగళి సోఁకియు సోఁకనిపగిది నరుఁడు.

భీష్మ— (నవ్వి) ఆచార్యా! యిం దాశ్చర్య మేమి? ఆతఁడొనర్చిన శిష్యత్వ
మెట్టిది? (ప్రక్కకుఁజూచి)

చ. మనలఁ బరిత్యజించి యదె మండలపుంగతిఁ దేరు త్రిప్పి య
ర్జునుఁడు సుయోధనున్ గదియఁ జూచుచుఁ బోవుచు నున్నవాఁడు తేఁ
డని యొనరింప లేఁ డతని నాఁగి క్షణంబునఁ బోయి తేని మ
న్నన నిలుపన్ వలెన్ దడసినన్ బయి వచ్చుఁ జుఁడీ కడంగుఁడీ.

అశ్వ— (పాఱఁజూచి) చూడుఁడు. రారాజుపై కరుగు కవ్వడికిఁ గర్ణుఁ డడ్డ
మగుచున్నాఁడు.

ద్రోణా— తండ్రీ! అట్లని మన మొప్పరికింపఁ జనదు. మీ రిరువురును బోయి
రాజుం గాపాడుఁడు. సలయు నేని యేమును వచ్చెదము.

(కృపాశ్వత్థామలు నిష్క్రమింతురు)

ద్రోణు- (భీష్మునితో) కర్ణార్జునుల ద్వంద్వయుద్ధ మెట్లున్నదో పరికించితిరా?

భీష్మ— ఉభయులును సమర్థులేకదా, అయిన నర్జునున కితఁడే కాఁ డెవ్వ
రేనియు లొచ్చనక తప్పదు. (పరికించి) కనుఁగొంటిరా! కర్ణు నతి
క్రమించి దుర్యోధనుఁ జెనకఁబోవు నవసరంబున మన యశ్వత్థామ
యనికిఁ గడంగెను.

ద్రోణు— (చూచి) యుద్ధము కడు భరముగా నుండెడినిగాని కవ్వడి యక్షయ
తూణీరుం డగుటచే నితని నతిశయింపవచ్చును. నేనుబోయి యతనిన్
దలపడియెద (కొండొకపోయి నిల్చి) ఇతం డెక్కతమునవో కుమారుం
దలపడకయె నావంకకు వచ్చుచున్నాఁడు.

అర్జు— (ఉత్తరునితోఁ బ్రవేశించి) ఉత్తరా! తేరమ్మహాత్మున కభిముఖ
ముగాఁ బోవనిమ్ము. (తనలో)

ఆ. వె. ఓనమాలు మొదలు నోజ్జయై విలువిద్దె
మెట్టితిట్టి చెప్పి మగుదతనము
చూపినట్టి గురునిపై కేమొకమ్మన
బవరమునకుఁ బోదు భయము విడిచి.

(విచారముతో) ఓహో! దైవమా! యిక్కురుకులపాంసను కారణ
మ్మున నెన్ని యిక్కట్టులు ఘటించితివి?

మ. 'పతితోఁ డీకొనుఁ బుత్రుఁ గన్న నవలా, భార్యాసమాయోగసం
గతుఁ డౌపై జననిన్ గణింపఁడు భిషక్పుత్రుత్వమున్ బూను యా
పితరోగుండు సమాప్తవిద్యుఁడు గురున్ ద్వేషించు' నన్నట్టి సా
మెత నన్ జూచి పఠింతురే? యిఁక జనుల్ మేనెల్ల నమ్మయ్యెనే.

(యోజించి) ఇట్లగుఁగాక (సమీపించి చేతులు జోడించి)

క. అడవులఁ బండ్రెండేఁడులు
కడు నిడుమలు గుడిచినట్టి కవ్వడి మీ శి
ష్యుఁడు మీరిడుదీపము మీ
యడుగులకుఁ ద్రికరణశుద్ధి నభివాదింతున్.

ద్రోణు— (ఆదరముతో లేవనెత్తి) తండ్రీ! దీర్ఘాయుష్మంతుఁడవై సర్వశ
మ్ముల వన్నెకెక్కుము. శిష్టాచారమ్ము కాపించితివి కావున,

క. చనుము రథ మెక్కు మాహవ
మునకున్ డీకొమ్మ మేము మును చెప్పిన యా
ధనురాగమమ్మును జక్కం
గనునొప్పఁగఁ జెప్పి మమ్ముఁ గయిసేయు విఁకన్.

అర్జు— (వినయముతో) తమయాజ్ఞ శిరసావహించుచున్నాఁడను. (రథ మెక్కి
సంశయముతోఁ దనలో)

క. గురుపై నెక్కురణీని శర
పరంపరలు విడుచువాఁడఁ బగతుఁడె? యాతం
డర లేక యాజ్ఞ యిడుఁగా
కరయంగా వలదె? యిట్టియాగడము నెపన్.

ఇట్లగుఁగాక. (ప్రకాశము)

ఉ. ఏనయి యెంత చెప్పినను నేయఁగఁజాల శరంబు మీఁద నా
పైనెనరుంచి యేయఁదగుఁ బ్రిప్రథమంబున నట్టులేని నా
మానసమందుఁ గల్గు ననుమానము వోవుటె కాక సత్యసం
ధానిరతుండు ధర్మజుఁడు తమ్మునిఁ గైఁ గడు నల్గకుండెడున్.

ద్రోణు (తనలో) బళిరా! అర్జునా! బళిరా! (ప్రకాశము) అట్లే కావిం చెదను. కాని రణోచితస్థలమునకుఁ బోవుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

భీష్మ— (సంతోషముతో) సెబాసు! అర్జునా! సెబాసు! "అనర్హ్యంపితు రాచార"మ్మనుట నీకు సర్వవిధమ్ములం బట్టినది.

చ. అలజమదగ్నిపుత్రునకు నస్త్రగురుం డెన, నాకు నీవునుం
గలన నొకింత వెన్నడవు "కౌరవ వంశమునందు నేఁటికిన్
గలిగెను యుగ్మమొక్కటి తగన్ గురుమెచ్చును గాంచినట్టి" దన్
విలసనమున్ గడించితివి వీరవరేణ్యుఁడ వైతి వొప్పఁగన్.

(పరికించి) ఏమీ? అస్త్రగురుఁడే కాక గురుపుత్రశారద్వతులు గూడ నోడినారే! అర్జునుఁ డుత్తరునితో నేమో యనుచున్నాఁడు. (విని) గోవులం దోలికొని పొమ్మని గోపాలకుల నాజ్ఞాపింపుమనియు, నీజయమంతయు నీవే కావించినట్లు నగరంబునఁ జాటింపుచుమనియును బోధించుచున్నాఁడు. (విని) మరల నేమో యనుచున్నాఁడు.

(తెరలో)

ఉ. అమ్మహితుండు చాపధరు లందఱికిం దలపువ్వు వృద్ధుఁడం
చు మ్మది నెంచఁబోకు మరిసూచనతాపటిమంబు పట్ల భీ
కమ్మగు జన్యనంబు పొడకట్టు నుమీమనుకొంటివో మహా
త్త్వమ్మున మేటి మాకొక పితామహుఁడే యన నేల? దేవుఁడే.

కావునఁ గడు జాగరూకుండవై సారథ్యమ్ము నెఱవేర్చెదవు గాక.

(ఉత్తరార్జునులు ప్రవేశింతురు.)

అర్జు— ఉ. ఆయన గెల్చి కాని మన మక్కురురాజుఁ గలంపలేము గాం
గేయున కాదరంబ కద! కేవలమున్ మనయం దనంగరా
దోయవనీశనందన! నయోచితమార్గము దప్పఁ డెప్డు డా
మ్నాయవిదుం డతండు గదనం బొనరించియ తీరుఁ దీరుగన్.

భీష్మ— (సంతోషముతో) అర్జునుండు నన్నుం గూడఁ దనవిద్యాపాటవమ్మున నానందింపఁజేయ నిట వచ్చుచున్నాఁడు. (ప్రక్కఁజూచి) మా యిరు వుర సమరముం జూమటకుఁ గాఁబోలుఁ గురురాజుతో పాటు యోధులం దఱును నీ దిక్కునకే వచ్చుచున్నారు. (సన్నద్ధుఁ డగును.)

(అంత దుర్యోధనాదులు ప్రవేశింతురు.)

అర్జు— (వినయముగా)

ఉ. పోరికి నిన్ను మార్కొనఁగఁ బోలునె ? యొక్కనికేనియుఁ మహో
దారచరిత్ర ! యట్లయినఁ దప్పక వచ్చె విరాటుబంటనా
కారణ మిట్టి నన్ వెకలిగాఁ దలపోసెదొ, యేమొ ? యీ దురా
చారుఁ గృతఘ్ను గౌరవవిచారవిదూరు క్షమింపు మయ్యెడన్.

భీష్మ— (ఆదరముతో) తండ్రీ! క్షత్రియోచితప్రచారప్రవర్తనుండ వగు నిన్నొకరు క్షమించుట యెందులకు ?

ఉ. శూలి నెదిర్చినట్టి యల శూరత విన్నది యాది నీకు భూ
పాలురె కారు దేవతలు భండనమం దెదురే ? యటంచు నేఁ
బోల నెఱుంగుదున్ సమరముం బొనరించెద నైన నన్ను నె
ట్లాలములోఁ గలంచెదవొ యయ్యయి భంగులు సూచు వేడుకన్.

ఉచితస్థలమ్మున కరుగుదము రమ్ము.

(నిష్క్రమింతురు)

అశ్వ— (ఆకాశము వంకఁ జూచి) ఓహో! ఆకస మెల్ల నంబరచరుల విమానము లెట్లు నిండినవో!

తే. గీ. తాతమనుమల సంగరౌద్ధత్యమునకు
సంతసించుచు నున్నారు చదల సురలు
హరిని సంగరమున గెల్చినట్టిఁ డొక్కఁ
డొక్కఁడో హరునోర్చిన యుక్కుతునుక.

కృపా— (చూచి) కుమారా! గాంగేయునిచాపముల నర్జునుఁ డెట్లు తుత్తుని యలు సేయుచున్నాఁడో చూచితివా ?

ఉ. ఎత్తెను జాప మాతఁ డొకయేటున నీతఁడు ద్రుంచె నెండి తా
త్తె నితఁడు ద్రుంచె నటు లెత్తుటయే తడ వెన్నిమాఱులో
తుత్తునియల్ పొనర్చె నరతూఁగు నెపం డిఁకఁ బార్థుతోడ లో
కోత్తరుఁ డాతనిం దొరయు యోధులు నున్న జగత్త్రయంబునన్.

ద్రోణ— (ఆశ్చర్యముతో) అవురా యితని శరలాఘవము !

క. చాపమ్ముఁ ద్రుంచి వేఱొక
చాపమ్ము గ్రహించునంత శాంతనవునిఁ బెం
దూపులఁ గొన్నిటఁ బార్థుం
డాపన్నునిఁ జేసి యని నదె, యెయ్యఁగనున్.

అశ్వ— (కర్ణునితో నెకసక్కెముగా)

ఉ. పార్థునిలావు నీ కెఱుఁగ వచ్చెనె ? యిప్పటికేని కాలపున్
వార్ధియొ నాఁగ నాతఁ డిటువచ్చెడి ; నానికిఁ గల్గుకూరిమిన్
సార్థకముల్ బొనర్ప సమయం బిదియే యెదిరించి నిల్వ ప్ర
త్యర్థిని గెల్వలేనిబిరుదమ్ములు వమ్ములు కావె యేరికిన్ ?

దుర్యో— (తనపైకి వచ్చుబాణమ్ముల నిపుణముగా వారించుకొనుట నటించును.)

కర్ణ— (సంరంభముతో) రాజా ! నేనుండఁగా నీ వెందుకు వారించుకొనవలెను ? (కొంతవడి నిలిచి పాఱుట నటించును)

దుర్యో— ఏమీ ? ఈనాఁ డితని విక్రమం బవక్రంబుగా నెగడుచున్నదే ! (యుద్ధసన్నద్ధుఁడగును)

అశ్వ— (తనలో) ఏనాఁ డతనివిక్రమ మవక్రము గాకున్నది ? మన కెప్పటి కప్పుడే క్రొత్తగాఁ గన్పట్టును.

అర్జు— (ప్రవేశించి) విరాటనందనా ! అదె సుయోధనుఁడు మనకుం జేఁ జిక్కియున్నాఁడు. అరదమ్మటు పఱపుము.

ఉత్త— (అలసటతో)

చ. ఎడ యొకయింత లే దొకటె యేయుట యే నిఁక నిల్వఁజాల మేన్
వడవడ లాడఁగాఁ దొడఁగె వారువముల్ కడు డస్సె నుంత యొ
క్కెడ శ్రమ దీర్చి కొంద మిటు లేకముఖంబుగఁ బోరు సల్పి యె
వ్వఁడు బడలండు లోకమునఁ ? బార్థులె పార్థివులెల్ల నర్జునా ?

అర్జు— (మీఁదఁ జెయి వైచి) రాజనందనా ! కడుబడలితివి. ఇఁకఁ గష్టించి నంత కాదుగదా ? అందు శతాంశమేనియు నవసరము లేదు.

మ. అదె రారా జతనిన్ బరాభవము చేయన్ గాల మేతెంచె దు
ర్మదుఁ డీతండు గణింపఁ డేరిని మహామాత్సర్యపర్యాప్తుఁ డి
య్యెడనన్ వైఁ బడ మేని జోదులు శ్రీమంబొఱన్ సమీపింతు రాఁ
గుదు రీయత్న మొకింతయోర్చికొనుమా ! కోపంబు దీపింపఁగన్.

అంత వలసిన నేన యశ్వమ్ములం గడపఁ గలవాఁడ. నీయథాశక్తిం బని సేయుము. (శరప్రయోగము నటించి)

ఉ. పాఱెదవేల ? జూదమని వచ్చితివో ? యిది భండనంబు తే
రూరక యెక్కు మాత్రమున నోడరు శత్రులు వీథులెల్లడన్

స్వారి యొనర్పఁగాఁ గలవె సామజయానము నెక్కి? శేఁడు నీ
పేరు నిరర్థకం బగును బెంపటి యేగినచో సుయోధనా!

తే. గీ. అబలఁ బాంచాలి నవమానమందఁజేయ
వచ్చు నోరెలుఁగని పశువ్రజముఁబట్టి
నెత్తి గొల్లలపైని వేవేగ నుఱుక
వచ్చు రాదొకో విచ్చిచ్చు వచ్చునేర్పు?

ఉ. రాజవుకావె నీవు? కురురాట్కులమందు జనింప లేదె? యే
యోజ ధరన్ భరించెద వహో! యని పౌరుషనవ్వ నింత ని
స్తేజుఁడ వేల వచ్చితి విసీ! యనిసేఁతకు యుద్ధ మన్నచో
భోజనమో? యలంకరణమో? యవరోధవధూవిహారమో?

ఉ. చంపెదనంచు భీతివడి సారెకుఁ బాఱెద వేల? నేను నిన్
జంపమి నిక్కువంబు రిపుడై త్రభుజుండు మదగ్రజుండు మా
యింపఁ బ్రతిజ్ఞఁగొంటెఱుఁగవే మిము నూర్వుర; మొన్న మొన్న నే
చంపెను మీవలెన్ ద్రుపదజన్ గికురించిన కీచకావళిన్.

దుర్యో— (సిగ్గువడి నిలుచును.)

భీష్మాదులు— (మరల యుద్ధసన్నద్ధులై శరప్రయోగము నటింతురు)

అర్జు— (ధ్యానమునటించి యమ్ము విడుచును.)

భీష్మాదులు— (అందఱును మూర్ఛ నటింతురు.)

అర్జు— ఉత్తరా! నీసహోదరి యుత్తర చెప్పిన పలుకు స్మృతికిం దెచ్చుకొని
వీరి యుష్ణీషాంచలమ్ముల నుత్తరించి యిటు తెమ్ము.

ఉత్త— చిత్తము. (దరికరుగఁబోవును.)

అర్జు—(మెల్లఁగా) మాట, యీమోహనాస్త్రమ్మునకుఁ బ్రతి పితామహుం డెఱుఁ
గుఁగాన నతని దెసకుంబోకుము. తక్కుఁగలవా రెఱుంగరు. వారల
తెల్విఁగను నాలోనఁ గృతకృత్యుఁడవై మరలిరమ్ము.

ఉత్త— (తలపాగల కొసలు కోయుట నటించును.)

భీష్మ— (ధ్యానము నటించి కనులువిచ్చును.)

ఉత్త— (పరుగున వచ్చి యర్జునుని చెంతనిలుచును)

అర్జు— ఇఁకఁ బోదము పద.

(నిష్క్రమింతురు)

భీష్మ— (తనలో) అన్నా! కిరీడి యెంతపని చేసినాఁడు? (కోపముతో)

చ. నిలునిలు పార్థ! మోహనము నీవ యెఱుంగుదువే? బలమ్ములన్
గలఁచెదె యుక్కివమ్ము మెయి? గల్గునె దీన యశంబు? ధర్మపుం
గలన జయంబొ వెఱ్ఱోకఁడో గాంచుట యుక్తము కాక నిద్దురన్
సొలసినవారిపైఁ దగునె? శూరతఁ జూపుట నిన్ను బోఁటికిన్.

(దుర్యోధనుని శిరము చక్కఁగాఁ బరికించి మెప్పుతో)

చ. కరుణయటన్న నీయదియ కౌరవనాథుశిరంబు నిప్పు డు
త్తరుఁడొగి నుత్తరించెనని తత్తరమందితి భ్రాంతి కల్మి ని
క్కురుపతి కిట్లు చేపడినఁ గుత్తుకలొక్కటఁ గత్తిరింపఁడే?
తరతమభావవేది యగు ధర్మజుదమ్ముఁడ వౌదు వర్జునా!

(ద్రోణాదులు మూర్ఛ దెలియుదురు)

దుర్యో— (కోపముతో)

శా. ఏఁడీ? ఫల్గునుఁ డేడఁబోయెనో కదా యిందెందుఁ గన్పట్టఁడే
కూడన్ ముట్టుద మేటికీ తడ వదే గోపాలకుల్ గొల్వ నా
జాడన్ బోయెడి మిన్నకుంట తగునే? శౌర్యమ్ము వమ్మయ్యెనే?
వాడం బాఱినమోముతోఁ బురికిఁ బోవన్ బాడియే యేనికిన్.

భీష్మ— కౌరవేంద్రా! ఎందులకీ పశ్చాత్తాపము?

చ. మనకపమానమా? కడుఁ బ్రమాదము దప్పెను గ్రీడి కేవల
మ్మును గరుణాత్ముఁ డేమిటికి మూర్ఛిత నాతనిఁ దూఱఁబోయె? ద
య్యనువునఁ గుత్తుకల్ దునిమెనా? మన మేమగువార మట్టి యో
గ్యునికి జయంబు కాక మఱియొక్కనికిన్ జయ మబ్బనేర్చునే?

దుర్యో— (లజ్జాదైన్యములను నటించును)

కృపా— (దృష్టినిగిడ్చి) పితామహా! సుశర్మకాఁబోలు ననతిదూరమ్మున నిటు వచ్చుచున్నాఁడు. అక్కడివిశేషము లేమైయుండునో?

అశ్వ— ఇక్కడ నింతమంది యోధానుయోధు లుండి యిట్లుజరిగినదికదా, ఇఁక నక్కడ మఱియెగలాగు జరుగునా?

చ. అట శమనాత్మజుండుఁ గవ లయ్యనిలాత్మజుఁడున్ గడంగిపో
రుటకుఁ దొడంగినన్ బలము రూపఱు టబ్రమె? వీరలెల్ల బా
సట యొనరింప నేగరె? విచారముతోడఁ బనేమి? పార్థు లె
క్కటిన దిగంతముల్ గెలువఁగా వినమే, కనమే తదుద్ధతుల్?

కర్ణు— (తనలో) అక్కటా! మొదట వీరెన్ని వచించిరో దైవమన్నియును ఘటించినాఁడే? (ప్రకాశము)

చ. బవరము సేయ నొక్కపుడు వచ్చుజయం బొకటఁ దొలంగు దీ
నివిషయమై విచారణము నెక్కలుపం బనిలేదు కానిచో
నెవరు నెఱుంగరే? విజయు నేర్తెఱ దైవబలంబు కాక యొ
క్కవిజయుఁడే జయించెననఁగా వశమే కురునాథ యందఱిన్?

కృపా— ఒక్కయర్జునుఁడే యొనర్చివవిట్టి వనేక దుర్ఘటకార్యమ్ములు గలవు. ఐనను మనయిప్పటి యవస్థకుం దగిన ప్రసంగ మింతకన్న నుండదు.

దుర్యో— (పితామహునికై) సమయభంగముం గూర్చి తమయభిప్రాయ మేమని స్థిరపఱచెదరు?

భీష్ము— నాయభిప్రాయ మిదిననెకే విశదీకరించితిని. వలసినచో

ఉ. ధర్మజుఁ డెన్నఁ డెయ్యెడ నధర్మపథంబునఁ గాలునెట్టఁడీ
మర్మము నీకునుం దెలియు మానవనాథ! తదర్థ మొక్కనిన్
నిర్మలచిత్తు నయ్యెడకు నీవనుపన్ సకలంబుఁ దెల్లమా
నర్మిలి మీకు వారలకు నౌ టిఁక నేనియు మేలు భూవరా!

దుర్యో— (తనలో) వారలకును మాకును జన్మాంతరమున నేమో గాని యీ జన్మమున మాత్రము సఖ్యముకుదురదు. (ప్రకాశము) కానిండు; పురికిం బోయి యిందుంగుఱించి యోజింతము.

(అంకము నిష్క్రమింతురు)

గద్య.

ఇది శ్రీ... తిరుపతి వేంకటేశ్వర విరచితం
బగు పాండవ ప్రవాసమ్మునందు సప్తమాంకము.



ఓం.

శ్రీమత్పరదేవతాయైనమః.

# పాండవప్రవాసము



## అష్టమాంకము.

(అంత నర్జునుఁడును నుత్తరుఁడును బ్రవేశింతురు)

ఉత్త— బృహన్నలా! (నాలుక కఱచుకొని) ఇంద్రనందనా! ఈ జయము నేనే యొనర్చినట్లు మాతండ్రిగారికిఁ దెలియఁ జేయింపు మంటివికదా? దానికిం గతమేమి?

అర్జు— ఏమనియా? కొమరుఁడు సంగర మ్మొనర్ప నేగెనని యాయన విని యుండి పదంపడి యెవరివలననో జయముకల్గినదన్న నంతగా సంతసింపఁడు. (చేయిసాఁచి) చూచితివా, యెట్లలంకరించిరో పట్టనము! (విని) ఉత్తరవిజయమంగళమని చాటింపు వినఁబడుచున్నది.

ఉత్త— (నవ్వి) పదంపడి దానికర్థము నిట్లు చెప్పుకొనవలయును.

అర్జు— ఎట్లు?.

ఉత్త— శ్రేష్ఠుఁడైన విజయుని సంబంధమగు శుభమని.

అర్జు— (పరికించి) కొలువుకూటముదాపునకు వచ్చితిమి. (విని) ఏదో మీతండ్రి గారు బిగ్గరగా నుపన్యసించుచున్నారు.

(అంతట విరటుఁడును బ్రచ్ఛన్నవేషులగు పాండవులు నల్వురును బ్రవేశింతురు)

విర— (కోపముతో)

ఉ. గొల్లలువచ్చి నాకొమరు గొప్పదనంబు వచింప నేను నా
 రెల్లను జాటఁ బంపఁ దగదే? యొక పేడికతమ్మునన్ జయా
 భ్యుల్లసనంబు గల్గునె? రిపుల్ రథసారథి కోహటింతురే?
 నల్లవో! యిట్టిమాట లనినన్ సహియింపను గంక! యింక నిన్.

ధర్మ—రాజా! కోపింపకుము.

క. కౌరవు లెక్కడ? మిగులఁగ
మారుఁడు పసితనమువాఁడు మనయుత్తరుఁ డ
పార్థివసంగరవిశే
షారూఢుం డేడ? గెలుచు టది యేడ? నృపా!

కావున నామాట విని బృహన్నలవిజయంబు చాటింప నంపుము.

ఉత్త—(విని) మన మొనర్చిన కపటము మీ యన్నగారికిని మా తండ్రిగారికిని గలహమునకుఁ గారణం బగుచున్నయది. మన మిఁకఁ దడయఁ దగదు. పోయి యథార్థము నివేదింతము.

అర్జు—నీవు ముం దరుగుము నీవెనువెంటనే నేను వచ్చెదను.

విరా—(కోపముతో)

క. పేడిఁ బొగడఁగ వలదన
నోడవు భయమింత లే దహో! నాయెడ నీ
జాడ యెఱుఁగంగవచ్చెను
జూడుము శిక్షింతునిను ననూయ యడంగన్.

(పాచికతో నివేయును)

ద్రౌప—(అపటీక్షేపముగా సైరంధ్రీవేషముతోఁ బ్రవేశించి, చీరచెఱఁగున రక్తముఁ దుడుచుట నటించును)

భీము—(క్రోధము సూచించును)

ఉత్త—(తత్తరముగా వచ్చి) తండ్రీ! యెంత యనుచితము గావించితివి?

ఉ. అమ్మహనీయుఁ డెవ్వరని యాత్మఁ దలంచితి? ధర్మమూర్తి లో
కమ్మఖిలమ్ము నేలఁగల కార్యవిచక్షణుఁ డుత్తమోత్తముం
డిమ్మెయి ధిక్కరింతువె? శుభేచ్ఛ్ఁలకున్ ద్విజవర్యరక్తపా
తమ్మది శ్రేయమే? సకలధర్మవిధిజ్ఞుఁడ విట్లొనర్తువే?

విరా—(విని వినని యట్లు పట్టరాని సంతోషముతో)

ఉ. కౌరవసేన నక్కడఁ బఁ గ్గీతి నెట్లు కుమార? యాజిదు
ర్వారులు వారల ప్పరశురామవిజేత పితామహుండు మేల్
భారతవీరులన్ గెలిచి వచ్చితి వెంతకుఁ జాల? నేను స
త్కారము గంటిఁ బుత్రకులఁ గాంచినవారలకెల్ల మేటినై.

ఉత్త—తండ్రీ! వదంపడి సకలమ్మును దెలియనగుం గాని ముం దయ్యనఘుని వేఁడికొని సుప్రసన్నుం జేసికొనుము.

విరా— కుమారా! బృహన్నల యెక్కడ?

అర్జు— (సమీపించును)

ఉత్త— (గౌరవముతో) ఈయనయే.

విరా— (తనలో) ఇతఁడే బృహన్నల యెట్లగును. (సంశయముతో ప్రకాశము)

ఆతఁడు పేడి యీతఁ డనఘాకృతిఁ బొల్చెడి శర్మకుమ్మంతుఁ డ
త్యాతతపౌరుషంబునకు నాకృతియో యన నొప్పువాఁడు ప్ర
ఖ్యాతగుణాకరుం డని మొగంబె తగం బలుకం దొడంగె నీ
కీతనిసఖ్య మెట్లొదవె? నేర్పడఁ జెప్పుము నాకుఁ బుత్రకా!

ఉత్త— సకలమ్మును బిదప విస్తరించి వచించెద. ఇపుడు సూత్రప్రాయముగా విని మఱియొండు వచింపక యిమ్మహామహు శరణంబు వేఁడికొనుము.

(పాండవులను ద్రౌపదిని గేల నిర్దేశించుచు)

ఉ. ఈయనఘుండు పాండుధరణీంద్రుని యగ్రతనూజుఁ డాతఁ డ
త్యాయతశక్తి భీముఁ, డితఁ డర్జునుఁ, డయ్యనఘుల్ కవల్, సతీ
గేయచరిత్ర పాండుసుతగేహిని యాయమ యాజ్ఞసేని, వీ
రీయెడ గూఢవర్తనమెయిన్ జరియింతురు సత్యసంధులై.

విరా — (పశ్చాత్తాపముతోఁ దనలో)

ఆ. వె. నను సుశర్మ పట్టుకొని రథమునఁబెట్టి
నంతలోన నన్నయాజ్ఞఁజేసి
విడుపఁ జేసినట్టి వీరుండు భీమసే
నుండె సందియం బొకండు గలదె?

నివురుగప్పిన నిప్పుపగిదినున్న వీరలయెడఁ గడునవజ్ఞ సలిపితిని. ఇందుకేమి నిష్కృతి? ఇట్లగుఁగాక (ప్రకాశము) అనఘాత్మ! నన్ను క్షమించి నాయపరాధము మరవవలయు. (ధర్మరాజు పాదములపైఁ బడఁబోవును)

ధర్మ— (పడకుండ లేవనెత్తి)

క. నరపాల! యిందు నీ త
ప్పరయఁగ లేశంబు గల్గ దఖిలమ్మును న
కృరునాథునిదురితమె నా
దురితమె కావలయు ధ్యాతదోషంబగుటన్.

దూత— (ప్రవేశించి) జయము జయము దేవా! దుర్యోధనమహారాజుగారి

యొద్దనుండి యెవరో యొకరాయబారివచ్చి ద్వారమున నున్నాఁడు.

విరా— ప్రవేశపెట్టుము.

రాయ— (ప్రవేశించి నలు దెసలు దిలకించి) ఇందు ధర్మరాజుగారెవరో నాకు నొకింత తెలుపవలయు.

ఉత్త— (చేతితో) ఆయనయే (చూపును)

రాయ— (వినయముగా) అయ్యా! "మీతమ్ముఁడు ఫల్గునుఁడు సమయభంగఁ బొనర్చెఁ గావునఁ దిరిగియు మీ రరణ్యమున యథాపూర్వమ్ముగ వసించి యజ్ఞాతవాసమ్ముఁ గూడ నాచరింపవలయు నఁట. ఈసంగతి మీతో మనవి చేసి మీయభిప్రాయమును దెలిసికొని ర"మ్మని మారాజుగారు నన్నుం బనిచిరి.

ధర్మ— (ధైర్యముగా) సమయభంగము లేశమును గాలేదనియు, మాయర్జునుని మీరు గుర్తుపట్టుటకుఁ బూర్వదినమునకే పదుమూఁడు వత్సరములు నిండె ననియు, మీరాజతో నామాటలుగా మమ్మాటికిఁ జెప్పుము.

రాయ— చిత్తము. (పోవుచుండఁగా)

భీము— ఓయీ! మాట.

ఉ. నిండెను వత్సరమ్ము లని నీపతితో నృపుఁ డాడినట్టు లు
ద్దండతఁ జెప్పి పిమ్మట నతం డది వెండియుఁ బృచ్ఛసేయ "జా
ల్మండ! సుయోధనుండ! యధముండ! త్రయోదశవత్సరంబులే
నిండుట గాదు నిండెనఁట నీదగు నాయువు" నంచుఁ దెల్పుమీ.

ఇట్లు గూడఁ దప్పక చెప్పుదువుగాక.

ఉ. నిండెను నీదుపాపములు నిండె భవత్పరిపాలనంబును
న్నిండెను నీసహోదరులనిక్కులు పెక్కులు సెప్ప నేల తాఁ
బండె నజాతశత్రుని తపంబును ద్రోపది భాగ్యరేఖ భీ
ముండును దమ్ములున్ గలుషంబూనిన యత్నమునంచుఁ దెల్పుమా.

అర్జు— నే నిట్లంటినని చెప్పుము.

ఉ. నిండినయాయువే మరల నీకు విరాటసుతుం డొసంగె లే
కుండిన బొమ్మపొత్తికల కుత్తరకై తలచీరఁ గోయుచో
దుండగు నెట్లు చంపినను దోసములేదని తోఁచి కుత్తుకన్
ఖండన సేయ నిప్పటికె కాఁదగు నుత్తర ముత్తరక్రియన్.

ధర్మ— (శాంతముగా) ఓయీ! వీ రనుభవించిన కష్టంబు లట్లు వీరలం బ్రేరేఁపుచున్నవి. తప్పక నా వచనంబులుమాత్రము చెప్పుము. పొమ్ము.

శాయ— చిత్రము.

(నిష్క్రమించును)

విరా— (వినయముగా) రాజేంద్ర! నీవీ సింహాసన మలంకరించి మీతమ్ము లందఱి నుచితరీతి నయ్యై మహాసనమ్ముల నుండం జేసి యింతవఱకు మీయెడ నే నొనర్చిన యపచారమ్ము మఱవవలయు. (బలవంతముగా సింహాసనమ్మునం గూర్చుండఁ బెట్టి భీమాదులం గూడ నుచితాసనమ్ముల నలంకరింపఁజేసి ద్రోపదిదిక్కై) అమ్మా! పాంచాలరాజపుత్రి!

చ. వరవుడముం బొనర్చితివి వామవిలోచన మద్గృహమ్మునన్
సరిసరి! యెంతదుష్కృతము సల్పితి మేనును మత్కుటుంబమున్
గురుకులవర్ధనీ? యనుఁగుగోడలిఁగాఁగఁ దనూజ నిత్తు ను
త్తరను గ్రహించి యక్కతనఁ ద ప్పిదఁజేయఁగదమ్మ! సోదరీ!

ఉ. దుష్టుఁడటం చెఱింగియు వధూమణి! కీచకునింటికి న్నినున్
శిష్టచరిత్ర నంపిన కుశీల సుదేష్ణ మదీయభార్య యే
కష్టము నందనున్నదియొ? కాఁగల కార్య మెసం డెఱుంగు? సం
తుష్టమనస్కవై శుభవిధుల్ ఘటియింపుము మాకు నెమ్మెయిన్.

ద్రౌప— (గౌరవముతో) అన్నా! నీతో వియ్యమందుట మాకుఁ బరమప్రియమే. తప్పక నీకొమరితను మాసుభద్రకుఁ గోడలింగాఁ గైకొంటిని.

ధర్మ— (తనలో) అగును, పాంచాలియూహ కడుఁ జక్కఁగా నున్నయది. ఆకన్నియ యభిమన్యునికే భార్యయగుట కడు నుచితము.

విరా— సోదరీ! మీకుటుంబములో నెవరికేనియును నాకు సమ్మతమే. ఇప్పటికి నేను ధన్యుఁడను. (ధర్మజుదిక్కై) రాజేంద్రా! నేఁట ఱేపట నీవివాహ మహోత్సవంబు సలక్షణంబుగా నడపి నన్నుఁ గృతార్థునిం జేయఁగోరెద.

ధర్మ— అవశ్యమును నట్లేజరగును. దీనికింత నొక్కి చెప్పవలయునా?

విరా— (భీమునిదిక్కై చిఱునవ్వుతో) బావా! మహాసనమ్మునకుం దగిన మిమ్ము మహానసమ్మున నియమించి తాఱుమాఱొనర్చిన నన్ను మన్నింపవలయు. (ధర్మజుదిక్కై) సకలలోకధురంధరత్వము వహింపఁగల మీకు నేనింతకన్న నేమిప్రియమాచరింతును? అయిన నిట్లగుఁగాక!

## భరతవాక్యము

ఉ. ధర్మమునందు నీవలెనె తక్కన్నృపుల్ చరియింత్రుగాక స
త్కర్మములందు నీవలెనె కర్మఠులెల్లఁ జరింత్రుగాక నీ
పేర్మిసహోదరుల్ బలెనె పెద్దలఁ బిన్నలు గారవింత్రు గా
కోర్మిని నీసతిం బలెనె యుగ్మలు లెల్లరు గొంద్రుగావుతన్.

## గద్య.

ఇది శ్రీ కింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి
బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వర
ప్రణీతంబగు పాండవ ప్రవాసమ్మున
సర్వంబును అష్టమాంకము
సంపూర్ణము.



## —◆ తప్పొప్పుల పట్టిక. ◆—

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 15 | గొదువ | గొదవ |
| 10 | 7 | ఛీ | ఛీ |
| 10 | 15 | బొత్తుగా | బొత్తిగా |
| 14 | 17 | జేవఁగ | జేవగ |
| 16 | 26 | మిఁతు | మింతు |
| 26 | 15 | నిఁగొ | నిగొ |
| 29 | 4 | నెఁపా | నెపా |
| 30 | 9 | గుసె | గుసే |
| 36 | 26 | అప్ప్ర | అప్రి |
| 42 | 21 | గెలిపు | గెలుపు |
| 44 | 31 | నెవ్వెఱ | నివ్వెఱ |
| 47 | 24 | డిఁయు | డియు |
| 57 | 2 | తింయు | తియు |
| 62 | 1 | నిరరుల | నిర్జరుల |
| 64 | 3 | పదఁపడి | పదపడి |
| 94 | 4 | వెటో | వేటో |
| 99 | 10 | జూద | జూత |
| 99 | 26 | యొగ | యొక |

# ఉపోద్ఘాతము.

## (ప్రథమముద్రణము.)

చదువరులారా !

ఈ యుద్యోగనాటకము విజయమునుండి వెడలించినదనియు నిందలి 1, 5, 6 అంకములు పునస్సృష్టియనియు, 3 అంకములు వెనుకటికన్నఁ గొన్ని యావశ్యకములను జేర్చికొన్నవనియు, నన్ని నాటకములందుంబలెఁ దగుపాటి మార్పులే తప్ప నిందేకపత్నీవ్రతులు బహుపత్నీవ్రతులుగను వీరు వారుగను మార్చిన నూతనాంశములు లేవనియును దామే గుఱుతింపఁగలరు. అభిమన్యుని వివాహానంతర గాథ నెత్తుకొని ప్రథమదినయుద్ధ ప్రారంభమువఱకిందు భారతోద్యోగ మిముడ్పఁబడిన., దనుట పేరువల్లనే తెలియనగు. యుద్ధప్రారంభతిథి నిర్ణయ విషయమును గూర్చి విజయపీఠికలో విస్తరించి చర్చించి యున్నారము. తుదకు నమావాస్యాపక్షమును ఖండించి దశమీపక్షము సిద్ధాంతీకరించియుంటిమి. కాని మరల దశమీపక్షమునకు నొకింత బాధించు నంశములు నేఁటికి రెండుమాత్రము కన్పట్టుచున్నవి.

శ్లో. సప్తమా చ్చాపి దివసా, దమావాస్యా భవిష్యతి
సంగ్రామో యుజ్యతాం తస్యాం, తా మాహు శ్శక్రదైవతాం.

పైసంగతి యమావాస్యవారి కుపకరింపకున్నను మా కపకృతి నొనరించుటకు సిద్ధముగనున్నది. ఉండుఁగాక ! ఈవిరోధమిట్లు వారించుకోఁదగునేమో యోచింపుఁడు. ఇది భారతసంశయము. దీని నల్పబుద్ధులగు మాబోటు లొకరిద్దఱుమాత్రమే నిర్ణయింప నశక్తులనుట స్వభావోక్తి. కాన మీరెల్లరును సహాయులై తోఁచినయంశములను దెలుపఁ బ్రార్థితులు. శ్రీకృష్ణుఁడు కర్ణునితో "నేఁక సుమారు వారము దినములలో యుద్ధ" మనియు "నాఁ డమావాస్య" యనియుఁ జెప్పినది ధ్రువమే కాని నాఁ డది జరుగలేదనుకోఁగూడదా. "అనుకొనుట కాధారమున్నదా !" యనిన విజయపీఠికలో నమావాస్యకుంగల బాధకములన్నియు నాధారములే యని వేఱుగఁ జెప్పవలయునా ? మఱియు నేఁక రెండవ యంశము.

శ్లో. తత్ర తే సుమహాత్మానో, న్యవసన్ పాండునందనాః
శౌచం నిర్వర్తయిష్యంతో, మాసమాత్రం బహిఃపురాత్.

వ్యా. అంత్యదినేప్రాప్త స్యాఽశౌచస్యద్వాదశాహేన నిర్వృత్తిరితి అతః
షట్త్రింశద్యుద్ధదోషనిర్హరణేన మాసమాత్రం శౌచసంపాదనోక్తి ర్యుజ్యతే.

ఇది యుభయపక్షములకును అంతో యింతో బాధకముగనే యున్నది. ఇట వ్యాఖ్యానము న్యాయముగాలేదు. వ్యాఖ్యాతరీతి విజయపీఠికలోఁ దెల్పి యేయుంటిమి. అల్పబుద్ధులమగు మన మీమహాభారత సంశయములను నిర్ణయింపనే నేరమో, లేక భ్రాంతి పురుషధర్మమని సర్వజ్ఞులగు శ్రీశంకరాదు లెల్లరును నొప్పి దాని నవస్థాంతరములయం దాత్మయందుఁ గూడ సమ్మతించి యుంటచే "వ్యాసో నారాయణోహరిః" అను శ్రీకృష్ణద్వైపాయనులుఁ గూడ నిందుల కించుక యవకాశ మొసఁగి భ్రాంతిసత్త నంగీకరించుట సూచించిరో! లేక యిటీవలి నవనాగరకులనుకొను నట్లీభారతామ్నాయము బహుకర్తృకమో? కాక యిందుఁ బ్రక్షిప్తములే కలవో? నిర్ణయించుట కడు దుస్తరమేయైనను నిందు మొదటిసంగతియే యుక్తమనుకొనినచోఁ గడు నుచితము. "తద్వ్యక్తమల్పేవయం" అను మురారి వచనమే మనకు శరణమగుఁ గాక! సంస్కృతాంధ్రభారతములకు భేదము గల్గుటకు హేతువు నన్నయభట్టు దీనిరచనలో నారాయణభట్టు సహాయమపేక్షించి యుంటచేతను, నారాయణభట్టు కర్ణాటభాషానిష్ణాతుఁడగుటచేతను నాభాషయందలి మార్పుల నిందుఁ జేర్పించెననితోఁచుచున్నది. కథాకల్పనలు కన్నడ గ్రంథములలో విశేషించి యుండును. ఆమార్పులు ద్రౌపదీస్వయంవరాదిఘట్టముల నున్నట్లు విజయపీఠిక తెలుపును. దానికేమి! భిన్నకర్తృకగ్రంథములు భిన్నాభిప్రాయములు గలవగుఁగాక. ఏకకర్తృక మని మనపూర్వు లనుకొనుచున్న సంస్కృత భారతము గూడ నిట్టి విరోధములకుఁ దావీయ వలయునా? చూడుఁడు.

## ధృతరాష్ట్రఉవాచ.

రాజపుత్త్రైః పరివృత, స్తథామాత్యైశ్చ సంజయ!
ఉపారోప్య రథే కర్ణం, నిర్యాతో మధుసూదనః
కి మబ్రవీ దమేయాత్మా! రాధేయాం పరవీరహా
కాని సాంత్వాని గోవింద, స్సూతపుత్రే ప్రయుక్తవాన్
ఉద్యన్మేఘస్వనః కాలే, కృష్ణః కర్ణమథాబ్రవీత్
మృదువా యదివా తీక్ష్ణం, త న్మమాచక్ష్వ సంజయ.

ఇట్లుండెఁగదా! యుద్ధప్రారంభమునకుఁ బూర్వమే ధృతరాష్ట్రుఁడు కర్ణుఁడు పాండవుఁడను నంశము నెఱిఁగియున్న నీయంశమును కొడుకునకుఁ జెప్పి యుద్ధోద్యోగమునుండి మరల్పకుండునా! యని సంశయము బాధించుచున్నది. దీనిని ద్రోణపర్వములోని

శ్లో. వ్యాయచ్ఛం నాఽవధీ చ్చైనం, కర్ణః కుంత్యా వచ స్స్మరన్
ధనుషోఽగ్రేణ తం కర్ణ, స్స్వభీద్రుత్య పరామృశత్.

ఈశ్లోకములును మఱికొన్ని శ్లోకములును బలపఱచుచున్నవి! ఇందుల కేదో తెఱఁగు సమాధానమున్నను నది యంత తృప్తికరముకాదు. తఱచు నైకర్తన పదముచే ధృతరాష్ట్రుఁడు కర్ణుని వ్యవహరించుటగూడ నీయంశమునే బలపఱచుచున్నది. శ్రీకృష్ణుఁడు విశ్వరూపప్రదర్శన మొనరించి తాను పరమాత్మునఁడను నంశమును దెల్పుటచేతనైన యుద్ధమునకు వెనుదీయని సుయోధనుఁడు కర్ణుని సాయములేకున్నను యుద్ధము మానువాఁడు గాఁడని సమాధానము చెప్పికొనఁగుఁ గాని యిది నాకేగాక లోకులకుఁగూడ నంత తృప్తికరమగు నుత్తరము కాదనుకొనియెదము. మఱియు నర్జునుని రణసాధనములు మాత్రమే దివ్యములని సుప్రసిద్ధము. మఱికొందఱివి కూడనున్నను యావత్సాధనములు గూడ దివ్యములై నట్లు వినము. అట్టిచో నభిమన్యుప్రభృతుల రణసాధనములేకాక ద్రౌపదేయులవియుఁ దక్కిన పార్థులవియుం గూడ దివ్యములైనట్టు లీశ్లోకములు చెప్పుచున్నవి.

సౌభద్రాదీన్ ద్రౌపదేయాన్ కుమారాన్
వహన్త్యశ్వా దేవదత్తా బృహన్తః
మాద్రీసుతం నకులం త్వాజమీఢం,
మహేంద్రదత్తా హరయో వాజిముఖ్యాః

ఆయీ యంశములన్ జర్చించినచో మిగుల విస్తరించి వ్రాయవలసియుండునని ప్రకృతమింతతో విరమించుచున్నారము. ఏమైనను దశమీ పక్షమే యిప్పటికి బలవత్తరమని మాయభిప్రాయము.

నేఁటికి దైవానుగ్రహము వలనఁ బాండవవిజయమున నున్న పొరపాట్లు సాధ్యమైనంతవఱకు సవరించి ముఖ్యాంశములు చేర్చి రెండు నాటకములుగాఁ బ్రకటించితిమి.

ప్రకృతమగు నీ యుద్యోగమున—ఖాయము, తరఫు అనుపదము లన్యదేశ్యములేయైనను సమ్మతించి యౌచిత్యమునకై యపేక్షపడి ప్రయోగించినవిగా రసవిదులెఱుఁగుదురుగాక. తక్కిన లోపములు దయాదువులగు మీరే దిద్దికొనఁ బ్రార్థింపఁబడుచున్నారు.

ఇట్లు,

తిరుపతి వేంకటేశ్వరులు.

# ఇందు వచ్చు పాత్రలు.



1. వ అంకము.

1 సూత్రధారుఁడు
2. మారిషుఁడు
3 అర్జునుఁడు
4 దుర్యోధనుఁడు
5 శ్రీకృష్ణుఁడు

2. వ అంకము.

1 శ్రీకృష్ణుఁడు
2 పంచపాండవులు
3 ద్రౌపది

3. వ అంకము.

1 వృద్ధపురోహితుఁడు
2 ద్వివేది
3 ధృతరాష్ట్రుఁడు
4 భీష్ముఁడు
5 నారదాదులు
6 శ్రీకృష్ణుఁడు
7 ద్రోణుఁడు
8 కర్ణుఁడు
9 దుర్యోధనుఁడు
10 అశ్వత్థామ
11 వికర్ణుఁడు
12 గాంధారి
13 జమదగ్ని
14 జాబాలి
15 విదురుఁడు
16 కృపాచార్యుఁడు
17 దుశ్శాసనుఁడు
18 సాత్యకి

4. వ అంకము.

1 శ్రీకృష్ణుఁడు
2 కుంతి
3 కర్ణుఁడు

5. వ అంకము.

1 పంచపాండవులు
2 శ్రీకృష్ణుఁడు
3 ఉలూకుఁడు
4 రుక్మి
5 పురుషుఁడు
6 ఘటీహారి

6. వ అంకము.

1 శ్రీకృష్ణుఁడు
2 పంచపాండవులు
3 భీష్ముఁడు
4 ద్రోణుఁడు
5 కర్ణుఁడు
6 యుయుత్సుఁడు

ఓం.

శ్రీమత్పరదేవతాయైనమః.

# పాండవోద్యోగము



## ప్రథమాంకము.

(నాంది)

శా. ధర్మజ్ఞుం డరిభీముఁ డర్జునయశోధాముండు పాపప్రభా
మర్మోచ్ఛిత్తి యమాయమాననిజనామప్రాభవుం డార్తహృ
చ్ఛర్మోదారుఁడు విశ్వరూపధరుఁ డుచ్చైశ్శ్రీపదాన్యుండు స
త్కర్మాధ్యక్షుఁడు పార్థసారథి యశఃకల్యాణముల్ గూర్చుతన్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును)

సూత్ర- మారిషా ! ఇటురమ్ము.

మారిషుఁడు- (ప్రవేశించి) ఇదిగో! వచ్చితి నేమియాజ్ఞ ?

సూత్ర- పాత్రంబుల నన్నిటి నాయత్తపఱిచితివిగదా ?

మారి— చిత్తము, సర్వము సంసిద్ధముగనే యున్నదిగాని మన పాత్రములయం దొక్కరుఁడు మాత్రము మన ప్రతిపక్షివంచనకు లోఁబడి మనలన్ దృజించి యరిగె.

సూత్ర— (తత్తరపాటుతో) ఎవ రతఁడు ?

మారి— అన్యుఁడు కాఁడు, తమ మేనమామయే.

సూత్ర— (కోపముతోఁ దనలో) ఓరీ! ప్రతిపక్షీ ! ఎంతపని చేసితివి ?

ఉ. మున్ను సుయోధనుండు, నృపముఖ్యుని ధర్మజు భాగినేయుఁ గూ
డ న్నెతిఁబోవుశల్యునిఁ గడంగి యెటో యొకయుక్తి పన్ని తాఁ
గ్రన్ననఁ దన్నుఁ జేర్చికొనుకైవడి నాదగు మేనమామ న
త్యున్నతు నాఁచికొంటివె నతుల్ పచరించి హితుం బొనర్చుచున్.

(యోజించి తల పంకించి) కానిమ్ము; నీకతండు సమయము వచ్చినప్పు డంతశ్శల్యాయమానుఁడై తుట్టతుద కపకృతియే యొనర్చునట్లు నా నేర్పుకల్మిని సంఘటించెదఁ గాక. (ప్రకాశము) మారిషా! అతఁడు లేకున్నను మన నాటకప్రయోగము కొఱఁతపడదు. ఆతని భూమికను ధరింపఁదగువారు మఱికొందఱు గలరు. ఏమైనను అతనివంటివాఁడు సామాన్యముగా మనకు లభించుట దుర్లభము. ఔఁగాక, గతించినదాని కేమి సేయఁగలము? ఏకాలమున కేది యెట్లు జరుగునో యెవరికిఁ దెలియును? సర్వమును కాలమే సంఘటించుచుండును.

మారి— చిత్తము. తాము వచించినట్లు కాలము ప్రతిక్షణమందును నేదో మార్పు కల్గించుచునే యుండును; చూడుఁడు.

ఉ. భీమధనంజయప్రభ లక్షీణము లయ్యెను; బాష్పపల్లవ
స్థేమముఁ బాసి యుండె సహదేవకుజంబు వనంబులోన; వ్యా
యామపరంబునన్ ద్రుపదజాయతబాష్పస్రవంబు నిండె; సం
గ్రామదినంబులుం దరిసెఁ గాలజధర్మము దాఁటలేపుచేన్.

సూత్ర— అవును, నీవు చెప్పినవన్నియు శరత్కాలజన్యంబులగు మార్పులు. కాలము సర్వకారణ మని యార్యులెల్లరును నేకవాక్యతగా నొప్పుకొనిన విషయము.

ఉ. కాలవశంబునన్ దిరుగుఁగాదె! దివాకరుఁ డబ్జయోనియున్
గాలవశంబుచేతనె జగంబు జనించు, రహించు, బ్రుంగు; నీ
కాలమె కర్మలేములకుఁ గారణ; మెన్నిట నెన్ని చూచినన్
గాలము దాఁటువాఁ డిల నొకండును లేఁడు కుశీలవాగ్రణీ!

కానిమ్ము, "గతం నశోచామి కృతం స్మరామి" కావునఁ బ్రకృత మనుసరింపుదము. (యోజించి) నేఁడు నా మాతులుం డన్యపక్షమునకుఁ బోయినను మనము ప్రయోగింపవలసిన నాటకము పాండవోద్యోగమని తన వర్తనచే సూచించియున్నాఁడు. కాని యీ నాటక చక్రమును ద్రిప్పఁగలవాఁడు నాబావమఱఁది మురళీదాసు. అతనిని నీవు పోయి వెంటఁబెట్టుకొని రమ్ము. నే నింతలో నీ నాటక కర్తలగు తిరుపతి వేంకటేశ్వరుల గురువగు శ్రీ చర్ల బ్రహ్మపండితాఖండలుని సంస్మరించి తత్ప్రసాదంబు వడసి వచ్చెదను.

మారి— చిత్తము. (నిష్క్రమించును)

సూత్రి— (అంజలి ఘటించి)

కాశీపండితుఁడై కృపాళుఁడయి ప్రఖ్యాతిప్రభాపూర్ణుఁడై
యాశీర్వాదముమాత్రి శిష్యులను విద్యావంతులన్ జేయు వా
గ్వైశద్యమ్మునఁ బొల్చు చర్లకులజున్ బ్రహ్మయ్యశాస్త్రిం గళా
రాశిన్ శ్రీకడియెద్దవాసు మది నారాధింతు నశ్రాంతమున్.

(నిష్క్రమింతురు)

(ఇది ప్రస్తావన)

(అంత నర్జునుఁడు ప్రవేశించుచు)

అర్జు— (తనలో)

చ. ద్రుపదుని పంపునన్ జనెఁ బురోహితుఁ; డా ధృతరాష్ట్రసూతి బల్
కపటి యినందు సంధి చెడఁగాఁ గమకించెడిఁగాని; తప్ప దా
లపుఁబని; సర్వమున్ గడపు లావు గలండు యశోదపట్టి; యా
రిపుజనకాలుఁ దోడుగ వరించెద సర్వము నిర్వహించెదన్.

(పరిక్రమించి యెదుటఁజూచి)

మ. అదిగో! ద్వారక; యాలమంద లవిగో! నందంబుఁ గోరాడు; న
య్యాదియేకోట, యదేయగడ్త; యవెరథ్యల్; వారలేయాదవుల్
యదుసింహుండు వసించుమేడ యదిగో! నాలానదంతావళా
భ్యుదయంబై వరమందురాంతరతురంగోచ్చండమై పర్వెడున్.

(ప్రవేశము నటించి యాశ్చర్యముతో) ఏమి! యీవిచిత్రము.

క. మనకన్న మున్ను దుర్యో
ధనుఁ డిట కరుదెంచెఁ గృష్ణుఁ దనవానిఁగఁ గ్రి
న్ననఁ జేసికొని చనన్ దన
మనమందుఁ దలంపఁబోలు మందుం డకటా!

వాసుదేవుండు పాండవపక్షపాతి, కాదు కాదు, ధర్మపక్షపాతి యగు
సుంతైన నితఁ డెఱుఁగఁడు కాఁబోలు. (నిరూపించి)

మ. అరవిందాక్షుఁడు శేషశాయి జగదేకారాధ్యుఁ డంభోధిజా
వరుఁ డార్తావనుఁ డంగజాంగజుఁడు శ్రీవత్సాంకుఁ డేమో! నిరం
తరనిర్నిద్రుఁడు నిద్రఁ జెందెడిఁ బవల్; తచ్ఛీర్షపుంబ్రక్క న
క్కురునాథుండదె కూరుచుండెఁ దరుకుల్ గుల్కంగఁ బీఠమ్మునన్.

**(యథోక్తముగా శ్రీకృష్ణ దుర్యోధనులు ప్రవేశింతురు)**

కృష్ణు— (కపటనిద్ర నటించుచుఁ దనలో)

క. రాఁడాయె నర్జునుఁడు; కురు
రాడపతంసంబు వచ్చె రమ్మని యనికిన్
దోడుగ ననుఁ గోరఁగ మో
మోడంగా పలసివచ్చు నొక్కింత యిటన్.

అర్జు— (భక్తితోఁ దనలో)

మ. జలజాతాసనముఖ్యదైవతశిరస్సంలగ్నకోటీరపం
క్తుల కెవ్వానిపదాబ్జపీఠి కడు నిగ్గుల్ గూర్చుఁ దత్సన్నిధ
స్థలిఁ గూర్చుండి భవంబు పావనముగా నైనాఁ గావించి నా
తొలిజన్మమ్ములఁ గూడుపాపముల నాందోళింపఁగాఁ జేసెదన్.

(కృష్ణుని పాదములప్రక్క నిల్చుండును)

దుర్యో— (అర్జునుఁ దేఁజేరుటఁ జూచి తనలో)

ఉ. ఏనిట వేగుదెంచుపని యేర్పడ సర్వము గుర్తెఱింగి రాఁ
గా నిటఁ దోఁపుఁ గృష్ణునకుఁ గవ్వడి యేకశరీర మందు నే
దానవవైరి పీనియెడఁ దా నవమానము చూపు టెట్లు? నా
పై నెనరూను టెట్లు? కడు బందుగుఁ డీతని కాతఁ డెమ్మెయిన్.

బంధుత్వమున కేమి! కొద్ది గొప్ప నాకును నది లేకపోలేదు! లేకపోవుఁగాక; నేను ముందుగాఁ దన్ను దర్శింపవచ్చితిని. దానిం బట్టి యీతఁడు నన్నవమానించినచో లోకులు "పక్షపాతి" యని తన్ను గర్హింతురని సందియ మందకపోఁడు. కానిమ్ము, సకలమ్మును నిప్పుడే తేలఁగలదు.

కృష్ణు- (తనలో)

క. నా యనుఁగుం జెలి నాదగు
కాయము నాజీవగఱ్ఱ కవ్వడి నన్నున్
సాయమ్ముఁ గోర వచ్చెన్
నా యంతస్తాప ముడిగె నను ముదమెసఁగెన్.

(నిదురమత్తు నటించుచు నర్జునాభిముఖుఁడుగా లేచి కౌఁగిలించుకొని ప్రీతితో)

ఉ. ఎక్కడనుండి రాక యిట? కెల్లరునున్ సుఖులే కదా? యశో
భాక్కులు నీదు నన్నలును భవ్యమనస్కులు నీదు తమ్ములున్
జక్కఁగ నున్నవారె? భుజశాలి వృకోదరుఁ డగ్రజాజ్ఞకున్
దక్కక నిల్చి శాంతగతిఁ దాను జరించునె తెల్పు మర్జునా!

(ప్రక్కకుఁ దిరిగి దుర్యోధనుం గాంచి గౌరవముతో)

• శా. బావా ! యెప్పుడు వచ్చితీవు ? సుఖులే భ్రాతల్ సుతు ల్పట్టముల్ ?
నీ వాల్లభ్యముపట్టు కర్ణుఁడును మన్నీలుఁ సుఖోపేతులే ?
మీవంశోన్నతిఁ గోరుభీష్ముఁడును మీ మేల్గోరు ద్రోణాదిభూ
దేవుల్ సేమమునై నెసంగుదురె ? నీతేజంబు హెచ్చించుచున్.

క. నీ వచ్చినపనిఁ దెల్పి ము
దావహుఁడవు గమ్ము నాకు ; నఖిలావనిపా
లావళిమౌళిమణీసం
భావితచరణుఁడవు నీవు వచ్చుట యనదే !

దుర్యో— (తనలో) ఇతఁ డర్జునుని సంభావించురీతి యొకవిధముగను నన్ను గౌరవించు నైఖరి మఱియొక తెఱంగుగను గన్పట్టుచున్నది. కానిమ్ము లోకాచారముగాన నేను వచ్చినపనిం దెల్పెదను. (ప్రకాశము) నేను వచ్చి చాల సేపైనది.

ఉ. కౌరవ పాండవుల్ పెనఁగుకాలము చేరువయయ్యె ; మాకు న
వ్వారికిఁ గూడ నెక్కుడగు బంధుసముద్రుఁడ వీవుగాన నీ
చేరిక మాకు నిర్వురకు సేమము గూర్చెడిదౌట సాయమున్
గోరఁగ నేగుదెంచితిమి గోపకులైకశిరోవిభూషణా !

క. ఇరువురకు సముఁడవగు ని
న్నరసితి నేఁ బ్రథమమునం దటుగానన్
సరసిజలోచన ! నాకున్
గరమనుకూలుఁడవు గమ్ము కయ్యమ్మునెడన్.

కృష్ణ — కురుకంఠీరవా ! నీవు చెప్పినది మిగుల యుక్తియుక్తముగ నున్నది. సర్వవిధముల మీకిరువురకు నేను సాయము చేయఁదగిన వాఁడనే. ఇఁక ముందువెనుకలం గూర్చి విచారింపుదము.

ఉ. ముందుగ వచ్చితీవు మునుముందుగ నర్జును నేను జూచితిన్
బందుగులన్న యంశమది పాయక నిల్చె సహాయ మిర్వురున్
జెందుట పాడి ; మీకు నయి చేసెద సైన్యవిభాగ ; మందు మీ
కుం దగుదానిఁగైకొనుఁడు ; కోరుట బాలుని కొప్పు మున్నుగన్.

దుర్యో— (తనలో) ఇతఁడేదో కుయుక్తి పన్నినను గొంత సాయము చేయక తీరినది కాదు. కానిమ్ము నాకంతే చాలును.

ఉ. నాకు గదాగురుండు భువనస్తవనీయపరాక్రముండు సు
శ్లోకుఁ డమాయికుండు రిపులోకభయంకరుఁ డస్మదర్థసం

ధీకుశలుం డుదారగుణధాముఁడు శ్రీబలరామదేవుఁ డీ
పోకలవాఁడు గాఁడు పృథపుచ్చఁడు మెచ్చఁ డతండు పార్థులన్.

(ప్రకాశముగా) వాసుదేవా! నీయిచ్చవచ్చినట్లే కానిమ్ము.

కృష్ణు— ధనంజయా! నీయభిప్రాయ మేమి?

అర్జు— సకలధర్మస్వరూపుఁడవగు నీ కొఱులు చెప్ప వలసిన దేముండును?

దుర్యో— (నవ్వి) బావా! నీ యావచ్ఛక్తిని బాటుపడి యర్జునున కింద భాగముగల్పించుటయే కాక కోరుకొనుటలోఁ గూడ మొదట నతనికే యవకాశమిచ్చియు, "నీయభిప్రాయమే" మని యడుగుచున్నావు. ఇంతకంటె నెవరి యభిప్రాయమైన నెట్లుండెడిని?

కృష్ణు— సుయోధనా! అట్లు కాదు.

క. నీవు స్వతంత్రుఁడ వీతఁడు
సేవకుఁ డగ్రజుని చెప్పు చేఁతలకు లో
నై వర్తించెడి నందుల
కై వేఱుగ నడుగ వలసె, నది యట్లుండెన్.

ఇప్పు డీతని నడుగకయే మనకుఁ దోఁచినట్లు భాగము లేర్పఱచి కోరుకొమ్మన నేవో యొకవిధమునఁ దనకుం బోలు తెఱంగునఁ గైకొని చనిన మీఁద నయ్యది ధర్మజునికి నచ్చనియెడల, "వాసుదేవుండు బంధుగుఁడయ్యును మమ్మును వంచించె" నని యనవచ్చును. అట్టియెడ "ముమ్మాటికిని నీతమ్మునికిఁ జెప్పియే చేసితి" మని ప్రత్యుత్తర మిచ్చుట కవకాశముంచుకొనుటకై యిట్లు చేయవలసివచ్చినది. ఇది యిట్లుండఁగాక, ప్రకృతము విచారించు కొందము.

తే. గీ. అన్నియెడలను నాకు దీటైనవారు
గోపకులు పదివేవు రకుంఠబలులు
గలరు నారాయణాఖ్యఁ జెన్నలరువారు;
వార లొకవైపు నే నొక్కవైపు మఱియు,

క. యుద్ధ మొనరింత్రు వార ల
బద్ధమ్మెందులకు? నేను బరమాప్తుఁడనై
యుద్ధమ్ము త్రోవఁ బోవక
బుద్ధికిఁ దోఁచిన సహాయమును బొనరింతున్.

దుర్యో— (తనలో) ఔరా! కృష్ణుఁ డెంత మోసము చేయుచున్నాఁడు? సేన నంతయు నర్జునున కీయఁదలఁచి యీపన్నిక పన్నినాఁడు.

# ప్రథమాంకము.

క. ఆయుధము పట్టఁడఁట ! యని
నేయండఁట ! "కంచిగరుడసేవ" యితనిచే
నే యుపకృతి యుద్ధార్థికి
నేయెడ నగు ? నిట్టివాని నెవ్వండు గొనున్ ?

(యోజించి) అయినను బరమాప్తుండగు శ్రీకృష్ణుని విడిచి యర్జునుం డితరము నపేక్షించునా ? (తలపంకించి) అపేక్షించని యెడలఁ గృష్ణుని కపటోపాయమెల్ల నాకే యుపయోగించుఁగాక !

అర్జు— బావా ! కోరికొనవచ్చునుగాదు ?

కృష్ణు— కోరికొనవచ్చును. నేను జెప్పిన మాటలు తుట్టతుదవఱకు వింటివికాదు? ఇదిగో, మరలఁ జెప్పుచున్నాఁడను.

ఉ. ఆయుధముల్ ధరింప, నని కగ్గముగా నొకపట్ల నూరకే
సాయము సేయువాఁడఁ ; బెలుచ న్ననుఁ బిమ్మట నెగ్గులాడినన్
దోయిలి యొగ్గుదుణ్ ; నిజము తొల్తవచించితిఁ గోరికొమ్ము నీ
కేయది యిష్టమో ; కడమ యీతనిపాలగుఁ బాండునందనా !

దుర్యో— (తనలో)

క. ఇట్టి దొకటి లేకుండిన
దట్టుఁ డితఁడు "పట్టిగొడ్డుతాక" ట్టిపుడీ
కట్టుంటఁ జేసి; నా కిఁతఁ
డెట్టుల్ దప్పండు నగుదు రెల్లరు నన్నున్

అర్జు- ఇదిగో ! గోరుకొనుచున్నాఁడను.

ఉ. నందకుమార ! యుద్ధమున నారథమందు వసింపుమయ్య ! మ
ధ్యందినభానుమండలవిధంబున నీదగుకల్మిఁ జేసి నా
స్యందన మొప్పుఁగాక ! రిపుసంతతి తేజము దప్పుఁ గాక ! నీ
వెందును నాయుధమ్ముదరి కేగమి కొప్పదుఁగాక కేశవా !

దుర్యో— (సంతోషముతోఁ దనలో) సర్వవిధములఁ గృష్ణుని కపటోపాయము మనకే యుపకరించినది.

తే. గీ. రథమునం దెన్ని చిత్రంపుఁ బ్రతిమలుండ
నందు శివుఁడును విష్ణువు నజుఁడు నెల్ల
దేవతలు నుండవచ్చు; నాకీవిఁ గృష్ణుఁ
డర్జునస్యందనవిభూష యగునుగాక !

(ప్రకాశము) బావా ! పరిశేషన్యాయమునఁ దక్కిన దాని నే నేను గైకొంటిని. ఇఁక నేనరుగుదునా ?

కృష్ణు— మంచిది, పోయిరమ్ము.

దుర్యో— (నిష్క్రమించును)

కృష్ణు— (అర్జునుని వీపుపైఁ జఱచి చిఱునవ్వుతో) బావా ! ధనంజయ !

ఉ. "ఆలము సేయ నే" నని యథార్థము బల్కితిఁ జుమ్మి యిట్టి గో
పాలుని నన్నుఁ గోరితివి, ఖండనపండితు లగ్నితేజు లు
త్తాలధనుర్ధరుల్ బహుశతప్రమితుల్ యదుసింహు లంపితిన్
బాలుగఁ గైకొనెన్ గురునృపాలుఁడు బాలుఁడవైతి పక్కటా !

అర్జు— (ఆనందముతో) బావా! నీయుద్ధ మేరికిఁ గావలయు? నీవు నా యండ నుండుటయే పదివేలు.

ఉ. "ఉన్నది పుష్టి మానవుల కో యదుభూషణ ! యాలజాతికిన్
దిన్నది పుష్టి" నీ వరుగుదెంచి రథంబున నున్నఁ జాలు, నే
సున్నముఁ జేసెదన్ రిపులఁ జూపఱు లద్భుత మంద; సర్వలో
కోన్నత ! నాకుఁ బేరొసఁగు మూరక చూచుచునుండు మచ్యుతా !

క. నీతూష్ణీం భావము పరి
ఖ్యాతిన్ మాకొసఁగు; నీవ యని చేసినచో
శీతాంశు నెదుట రిక్కల
భాతిన్ బార్థులకుఁ బేరు బయలెక్కునెటుల్ ?

క. పదివేలలెక్కయే మొక
పదికోటులు వీరులున్న భరమా నీకే
మెదురై తిమేని జయమున ;
నిదియెఱిఁగియె కోరితినిజుమీ నిను దేవా !

క. గోపాలుఁ డనినఁ దక్కువె
గోపాలుఁడవే నిజంబు గోపాలక ! నీ
గోపాలకత్వ మొసఁగున్
గోపాలక తాభరంబు గొబ్బున మాకున్.

కృష్ణు — (ప్రసన్నభావముతో) ధనంజయా ! నీకు నాయందుఁ గల భక్తికిం గడు సంతసించితిని.

ఉ. ఊరక చూచుచుండు మను టొప్పితిఁ గాని భవద్రథస్థ నన్
బాలిగఁ జూచి నీ రిపులు పక్కున నవ్వి యనాదరింతు రా
శూరకులంబు మెచ్చ రిపుసూదనతాధర మూను నీకు నే
సారథినై యిఁకన్ విజయసారథినామమునన్ జరించెదన్.

అర్జు — (పట్టరాని సంతోషముతో) దేవా ! లీలామానుషవిగ్రహా ! నేను జిర కాలమునుండి యేది మనంబున నభిలషించితినో యయ్యదియే నీవు ప్రసాదించితివి.

క. బందుగుఁడ నీకు నోయదు
నందన ! భక్తుండ నట్టి నన్నెటులైనన్
ముందఱకుఁ దెచ్చుభారము
నం దేవర ; దెనఁడు సుకృతి నాకన్న నిఁకన్.

పూర్ణముగా ననుగ్రహింపఁ బడితిని.

ఉ. సారథి యంట ! వేదములసారము శౌరి ; తదంఘ్రిభక్తిచె
న్నారెడు క్రీడి తా రథికుఁ డౌనఁట ! చిందము విల్లుఁ దేరునున్
వారువముల్ మొదల్ దివిజవర్గ మొసంగినవంట ! యస్త్రవి
స్తారగురుల్ శివాదులఁట ! సంగరమం దెవఁ డాఁగఁజాలెడిన్.

బావా ! అన్న నీరాకకై వేచియుండును గావున నుపప్లావ్యంబున కరుగుదము రమ్ము.

కృష్ణు— మంచిది, పోవుదము. అర్జునా ! మా సుయోధనుఁ డిప్పు డెక్కడి కరిగెనో యెఱుఁగుదువా ?

అర్జు— బలదేవుని సందర్శనమున కని తలఁచెదను.

కృష్ణు — నీ వనినట్లె ! నీవుమాత్రము మా యన్నను సందర్శించి సహాయ మేల కోరవు ?

అర్జు— నామనంబునఁ గల యథార్థము వచించెద నాలింపుము.

ఉ. ఈ వొకరుండవే జగము లెల్ల జయించెద ; వేనుగూడ న
శ్లే విలయంబొనర్పఁగల ; నెందును జేర్గలవాఁడవౌట నీ
కీ విజయప్రశస్తి యగునేమొ యటంచు మదిన్ దపింతు స
ద్భావముకల్మి నా యభిమతం బొడఁగూర్చితి ; కొండ నెక్కితిన్

మ. బలరాముండు బలాభిరాముఁ డతనిన్ బ్రార్థించినన్ వచ్చుఁ బో
కలన న్నీవలె నుండు టొప్పఁ డతఁ డక్కంఠీరవం బెల్ల యో
ధులఁ జక్కాడు మృగావళిన్ బలె ; యశోదుగ్ధాబ్ధి నింకొక్క ప్రో
ల్వేలయించున్ దనపేర ; నాకు జగతిన్ బేరెట్లు పెంపారెడిన్.

కృష్ణు— (నవ్వి) ధనంజయా! అతఁడు మన కెదుటిపక్షమున నిల్చినచో నప్పుడు మాత్రము సంగరంబు భారముకాదా ?

అర్జు— అగుఁగాక ! నీయనుగ్రహ మున్నచో నే లోపమును రాదు.

కృష్ణ— (నవ్వి) నీ ధైర్యమునకు సంతసించితిని. ఇఁక నిజమువచించెద వినుము.

ఉ. వచ్చెడివాఁడు గాఁడతఁడు వారికి మీకును గూడఁ దోడు ; వి
ప్వచ్చుఁడ ! యమ్మహామహునిభావము మున్నె యెఱింగినాఁడ ; నా
సచ్చరితుండు మీకుఁ దగ సంధి పొసంగిన సంతసించు, నా
యిచ్ఛయు నట్టిదే ! మన నరేంద్రుని యిచ్ఛయుఁ గూడ నిట్టిదే.

కావున మన మిఁక నిందులకై యత్నింతము రమ్ము.

(నిష్క్రమింతురు.)

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వరులచే రచింపఁబడిన
పాండవోద్యోగమునందుఁ బ్రథమాంకము.



ఓం.

శ్రీమత్పరదేవతాయైనమః.

# పాండవోద్యోగము

## ద్వితీయాంకము.

(పిదపఁ బాండవులైదుగురును ద్రౌపదియుఁ గృష్ణుఁడును ప్రవేశించుచున్నారు.)

కృష్ణు— దేవా! అజాతశత్రూ! యుధిష్ఠిర!

క. నాతరము కాక యున్నను
చేతులు జోడించుకొనుచుఁ జేసెద దానిన్
నీతలఁపు దెలుపు మఖిలధ
రాతలపతిమౌళిరత్నరంజితచరణా!

ధర్మ— దేవా! వసుదేవనందన! నీయొనర్చు సంబోధనము భావికార్యసూచకమేమో గాని వానప్రస్థుఁడ నగు నే నిప్పటి కందులకుఁ దగను.

ఉ. "తమ్ముని బిడ్డలంచు మదిఁ దల్పఁడు పుత్రులలోనఁ గూడె రా
జ్యమ్మున మీకుఁ బాలొసఁగఁ డంధనృపాలుఁ" డటంచు మొన్న నీ
సమ్ముఖమందె తెల్పెఁగద! సంజయుఁ; డా కురురాజు లుబ్ధచి
త్తమ్మునఁ గన్నుఁగానఁ డిఁకఁ దప్పదు యుద్ధము బంధునాశమున్.

జయపరాజయంబులు దైవాధీనంబు లనియు నాదైవంబ వగు నీవు మాయెడలఁ గలవనియు నెఱుఁగుదును. అయినను,

ఉ. ఆలును బిడ్డ లేడ్వ నృపులాలములోఁ గడతేఱ కెల్లమ-
ట్టాలును రూపుమాయ కకటా! యిల దక్కునె? దక్కనిత్తురె?
చాలును రాజ్యభాగము; పరిజనుల్ సుఖియించిన నాకుఁ జాలు; నేఁ
జాలక కాదుచూనె! తినఁజాలను నెత్తురుకూడు మాధవా!

కృష్ణు— బావా! యీ యసమయనిర్వేదమేల? క్షత్రియకుమారులకు నెత్తురుకూడ గాక జోలికూడు తినుట ధర్మమా? అయినను నీ యభిమతంబేచే

యో నిర్వర్తించుటయే మాకుఁ బరమధర్మము కావున దెలుపుము.

ద్రౌప— తెలుపవలసిన దేమున్నది? మొన్న సంజయుఁడు "నీకు వారు యుద్ధము చేయనిచో రాజ్యమీయ" రనియు, "నీవు యుద్ధముచేసి రాజ్యము కోరుటకన్న నంధకరాజ్యమందో వృష్ణిరాజ్యమందో బిచ్చమెత్తుకొని జీవించుట కొంత యుక్త" మనియు బోధించెను గదా! అట్లు బిచ్చమెత్తుకొనుచు మధ్యమధ్య వనంబుల కరిగి వెనుకటివలెనే కందమూలంబు లారగించుచు ఋషులతో ధర్మశాస్త్రంబులు ముచ్చటించుకొనుచు నుండవలసినదనియే మీ బావగారి యభిప్రాయము.

కృష్ణు— అమ్మా! ద్రుపదరాజపుత్రీ! చెప్పవలసిన దంతయుఁ జెప్పనిమ్మా. (యుధిష్ఠిరుదిక్కై) దేవా! యుధిష్ఠిర మహారాజ!

చ. సంజయు రాయబారమున సార మెఱింగితి మాతఁ డెందు మీ
కం జను శాంతి, వారలకుఁ గోపము యొప్పెడి; మీకు బిచ్చపుం
గంజి రుచించు వారలకుఁ గమ్మనిపాలు రుచించు; మీకునై
వింజము పుట్టె, వారికయి వృద్ధి జనించె నటంచుఁ జెప్పెడిన్.

ఔరా! యేమి యీశుష్కప్రియములును శూన్యహస్తములును!

క. "మా కాయుష్యము మఱియున్
మా కారోగ్యంబు మఱియు మాకు ధనంబున్
మీకు ఋణ" మన్న తెఱఁగున
కీ కౌరవనాథుసంధి దృష్టాంత మగున్.

క. పా లీకున్నను దమ కం
దాలోఁబడి తినుటకేని దయసేయఁడె భూ
పాలుఁడు ధృతరాష్ట్రుఁడు స
చ్ఛీలుం డాతనికి నెవరు చెప్పెడివారల్?

ఈ సంధి సర్వవిధముల "నీకంట నేను వ్రేలిడెదను నానోట నీవు వ్రేలిడు" మన్నట్లున్నది. ఇది యిట్లున్నను నీమనంబు యుద్ధమునకు వెనుదీయుచున్నది. అగుఁగాక; నీనిశ్చయము వ్యక్తీకరింపుము.

ధర్మ— నీ నుడివిన దంతయు నిక్కమే; అయినను పితామహకుంభసంభవ కృపాచార్య ప్రముఖులు వినుచుండఁ బేరోలగమునఁ బుత్ర శతసంవృతుఁడగు మా పెద్దతండ్రితోడ నీవుఁగూడ నొక్కసారి సంధివచనంబులు విన్నవించిన వినునేమో యని తలఁచెదను. కావున నన్ను మన్నింపుము.

ఉ. ఇంతకు సంధిమాట వినసీ వినకుండఁగనీ మనంబు ని
శ్చింత మగుꣳ, జనంబు మన సేమమె కోరుదు, రెల్లవారు నిం
దింతురు వారి నిశ్చయము నిన్ను నుతింతురు మాకుఁగీర్తి సా
మంతనృపాలు రందఱకు మావ్యవసాయము తేట తెల్లమా.

కాన మమ్మీ యాపత్సముద్రము దాఁటింపఁ గర్ణధారుఁడవు గమ్ము.

ఉ. సంధి యొనర్చి మాభరత సంతతి నిల్పుము లేద యేని గ
ర్వాంధుల ధార్తరాష్ట్రుల సహోయులతోఁ దునిపింపు మో జగ
ద్బాంధవ ! రెండు కర్జములభారముఁ బెట్టితి మయ్య ! నీభుజ
స్కంధమునందుఁ; దారసిలుఁగావుత మాకుయశంబొ రాజ్యమో.

సకలధర్మస్వరూపుఁడవును సమస్తశాస్త్రవిశారదుఁడవు నగునీకు మా యుపదేశం బనావశ్యకము. అయిన నొక్కవిశేషంబు వినుము.

గీ. సౌబలేయులు సంధి కిష్టపడిరేని
అన్నదమ్ముల మేము నూటైదుగురము
పాడిమెయి నిష్టపడరేని వారునూఱు
గురె సహోదరు; లేమైదుగురమె కృష్ణ!

కృష్ణ— అట్లుజరుగుటయే దుర్లభముగాని జరిగిన మంచిదియే కదా.

ఉ. మీరును మీరుఁ గీడ్వడుట మేలగునే ప్రజకైనఁ గాని దు
ర్వారులు ధార్తరాష్ట్రులు భవాదృశు లౌదురె ధర్మరాజ ? నీ
కోరికెఁ జేయఁగూడ దనఁగూడదు గావునఁ బోవువాఁడ; నీ
కూరిమి నోరిమిꣳ బ్రజలకు న్హితం బొనరింతు నచ్చటꣳ.

ధర్మ— (ఆలోచించి) పాపాత్ములగు సుయోధనాదులకడకు నిన్నువంటివారిం బనుచుట యపాయకరంబనియెఁ దలఁచెదను. త్రిలోకాధిపత్యం బేనియుఁ బాండవులకు నీ సేమమువంటిది గాదు గదా !

కృష్ణ— (నవ్వుచు) బావా ! అట్లైన్నఁడును సందేహింపకుము.

క. ఉక్కువులగు కౌరవులుం
దక్కిన భూవరులుఁ గలిసినను బార్థివ ! నా
ప్రక్కకు రానేర్తురె ? యొక
లెక్కయొ నిక్కముగ నే నలిగినం జెపుమా ?

గీ. న్యాయమార్గంబు విననికర్ణత్రయంబు
గలుఁగువాడుగదా ! యట్టి ఖలునియెడల

సంధికుమరునె యను నొక్కసందియంబె
కాని మనమున నాకొండుగలదె వెఱపు?

ధర్మ— నీకొక్కరివలన వెఱపు లేదనుట సత్యమే. అయినను,

ఉ. దౌత్యముపట్ల నీదుదెసఁ దప్పుపనుల్ పచరించు కౌరవ
ప్రాత్యుల రూపుమాపుపని పట్టినఁ బట్టఁగవచ్చుఁ గాన మీ
సాత్యకి వెంటఁబెట్టుకొని చన్మచటన్ గృతవర్మ కౌరవా
మాత్యుఁడెయయ్యె యాదవుఁడు మాధవ! నీకనుకూలుఁ డయ్యెడున్.

భీము— (కనులెఱ్ఱఁజేయుచు) ఇంతకు సంధి యేమని?

ద్రౌప— (ఎకసక్కెముగా) ఐదూళ్ళిచ్చినఁ జాలు నని యఁట.

భీము— (తనలో) ఆహా! కాలవైపరీత్యము.

చ. అనుపమవిక్రమక్రమసహాయుల కంతటి పాండురాజనం
దనులకు నొక్కకూళ భరణం బిడుచాడ్పున నూళ్ళులైదు ని
చ్చునఁట! కటా! యటు ల్బ్రదుకఁ జూచుట రాచకొలంబువారికిన్
ఘనతయె? మంత్రరుద్ధభుజగంబ నిసీ! యిపు డేమిచేయుదున్.

(దుర్యోధనాదుల నెదుట నున్నవారిపలె భావించుకొనుచుఁ బ్రకాశము) ఓరీ! దుర్యోధనదుశ్శాసనహతకులార!

ఉ. అగ్రజుఁ డంపుఁగాక నరకాసురమారకుఁ డేగుఁగాక! మీ
రుగ్రత మాని సంధిపడ నుందురుగాక! యిపంభుజాగ్గళో
దగ్రగదాప్రహారములఁ దప్పదు మృత్యువు మీకు నమ్ముఁడీ
యగ్రజు సంధికిన్ నృపతులందఱి చావమియే ఫలంబగున్.

ద్రౌప— ఏమీ! దుర్మార్గులగు కౌరవు లెదుటనుండి తలపట్టి యీడ్చి కట్టు పుట్టంబులొలువఁ జూచుచుండియు నన్ను దిక్కుమాలినదానిఁగాఁ జేసిన పార్థమధ్యమున కీ యసమయకోపము! ఔను! అసమర్థుల కందును బరోక్షమునందె ప్రగల్భోక్తులు మెండు.

భీము— (ఎదుటఁజూచి) ఏమీ యిచ్చట వారు లేరా? కోపాంధకారమునఁ గానక యిట్లంటిని. ద్రుపదరాజపుత్రీ! నిజము అసమర్థులమే! కాదేని,

మ. ఒకదుర్మార్గుఁడు కొప్పు పట్టికొని సర్వోర్వీపతు ల్చూడఁ గొం
కక నీకట్టినపుట్ట మార్యసభ లాగం జూడమే! దాని కూ
రక యున్నట్టి కతంబ యస్మదసమర్థత్వంబు వాక్రువ్వఁగా
సకి! యింకేటికి మమ్ము దూఱెదవు? వాచాశూరు లిప్పాండవుల్.

ధర్మ — క్షత్రియదంపతులారా! శాంతింపుఁడు శాంతిపుఁడు. భవితవ్య మెన్నఁటును గాకపోదు.

భీము — శాంతించి చిరకాలమైనది. (గద నేలంబడవైచుచున్నాఁడు)

కృష్ణు — ఆర్య! ధర్మతనూజ! సంజయుని మాటలు వింటిని. నీ నిశ్చయంబును వ్యక్తపఱచితివి. ఇఁక బయనమై హస్తినాపురంబునకుం బోయి నీయభిమతం బీడేర్పఁ బ్రయత్నించెదను. కాని,

గీ. మోఱకులు కౌరవులు నీతిదూరు లనుచుఁ
జెలిమి ఘటియిల్లుటయు ననిశ్చయ మనుచుఁ
దెలిసి యుండియు నీబుద్ధికలఁతపడియె
బురదలో బడ్డ యేనుఁగుఁబోలె నధిప!

ఉ. మాయదురోదరంబున నమాయికుని న్నిను గెల్చి కాంతకుం
జేయఁగరానియంతపనిఁ జేసి యరణ్యములోని కంపియుఁ గా
హాయిగ నుండనీక ఖలులై పలునెగ్గులు పన్ను చున్న యా
దాయలు చత్తురంచు దయఁదాల్చెద వెంతటి ధర్మరాజవో!

విక్రమరహితులగు రాజుల కాపదలు మెండనియు, నిడుమలుపడువాని కదృష్టము దూరమనియు, నదృష్టహీనునకు భాగ్యంబు చేకూరదనియు వచించుపెద్దల నీతివాక్యములు స్మృతికిం దెచ్చుకొనుము.

గీ. శత్రుపక్షంబు నిరసించి సంగరంబు
సేయ మదిఁ జొన్పమయ్యె నిశ్చింత మీఱ
నేనుఁగులఁ జంపి జీవింపఁ బూనుఁగాని
నీరసంపడ దెపుడు కంఠీరవంబు.

గీ. మానహానికి సమ్మతింపరు మహాత్ము
లసువు లైనను విడుచుట కనుమతింతు రి
బూది ముంగాలఁ దన్నుచుఁ బోవుఁగాని
మంట దరి కేగఁజూచునే మనుజగణము?

ధర్మ — శాత్రవులు మిగుల బలసంపన్నులు. మనమా! యంతటి బలసహాయము లేనివారము. జయంబెదరికో మనకో తెలియుట దుర్లభము; దానం జేసి సుఖము వైకల్పికము. అని తలఁచి నిశ్చితసుఖంబగు సంధిసేయుటయే మనకుఁ గర్జంబు.

కృష్ణ — యుధిష్ఠిరా! నీబలపరాక్రమములును నీతమ్ముల తేజంబును నీవెఱుఁగక మాటలాడుచున్నావు.

ఉ. నాల్గుపయోధులో యనఁగ నాలుగుదిక్కరులో యనంగ నీ
నల్గురు తమ్ములుం బ్రమథనాథసమానులు; యుద్ధరంగమం
దల్గిన నెవ్వఁ డోపఁగలఁడయ్య! భవత్పరిభావవహ్నికిం
గల్గిన వృద్ధి యింక రిపుకాంతల బాష్పము లార్పఁ జూడుమా.

ఇదియు భవితవ్యమునకుం దగినయుపదేశముగాని నీతలంపున కన్యథాకరణంబు కాదు.

ఉ. ఐనను బోయి రావలయు హస్తిన; కచ్చటి సంధిమాట యె
ట్లైనను శత్రురాజుల బలాబలసంపద చూడవచ్చు నీ
మానస మందుఁగల్గు ననుమానముఁ దీర్పఁగవచ్చుఁ దత్సమా
ధానము మీవిధానమును దాతయు నొజ్జయు విందు రెల్లరున్.

భీము— (బిగ్గరగా) ఓయీ! కురుపాండవసంధివిధానధౌరేయ! పాండవదూతా! జనార్దనా! మారాజుగారి తలఁపు వేఱు నీతలఁపు వేఱుగనున్నది.

ఉ. యుద్ధము యుద్ధమంచు మదియుబ్బఁగ నీవును, మానినై యసం
బద్ధములైన వాక్యములు పల్కకు మం దెవ రెట్టు లాడినన్
క్రుద్ధుఁడ వౌచు సంధిఁ జెడఁగొట్టక ధర్మతనూజుకార్యసం
సిద్ధి యొనర్పు మయ్యనఘు సేమమె మావను సేమ మన్నిటన్.

ప్రకృతిదుర్లలితుండును నాజన్మపాండవద్వేషియు నైశ్వర్యమదమత్తుండును గ్రూరపరాక్రముండును దురుద్యోగియు మానియు నగు సుయోధనుండు సచ్చుటకైనఁ దెగుఁ గాని తనమతంబు సడలఁడు. వాని నైజంబు నీవెఱుంగనిది కాదు.

గీ. ఒక్కొకకులంబు నశియింపఁ నొక్కఁడొకఁడు
పుట్టు వొందిరి పూర్వ మపూర్వనృపులు
ఖలులు నేఁటికి గాంధారికడుపునందు
జననమందిరి భరతవంశంబుఁ గాల్ప.

కానఁ జతురుపాయంబునం గాక తక్కిన చతుర్థోపాయంబుల వానిఁ జక్కఁబఱుపము.

కృష్ణు— (నవ్వి) ఇవి భీమసేనుని మాటలేనా! (సమీపించి చేతితోఁ జఱచుచు)

గీ. నిదుర వోచుంటివో? లేక బెదరి పల్కు
చుంటివో? కాక నీవు తొల్లింటి భీమ
సేనుఁడవె కావో? యెన్నఁ డీచెవులు వినని
కనులు చూడనిశాంతంబు గానవచ్చె.

"కురుపతి పెంపొద ల్వఁబగఁ గొట్టెద బొమ్మ పగిల్చి వెచ్చనె
త్తురు కడుపారఁ గ్రోలి యనిఁ దుస్మెద దుష్టుని దుస్ససేను భీ
కరగదచేత" నంచును బ్రగల్భము లాడితి వల్లకొల్వులో;
మరల నిదేల? యీపిటికిమానిసిపల్కులు మృష్టభోజనా!

ద్రౌప— భగినీవత్సలా! నూఱుమాట లాడవచ్చునుగాని యొకమాట నెఱ వేర్చుట దుర్లభముకదా!

కృష్ణు— ఔను! మానవతీశిరోమణీ!

గీ. బరువుమోయఁగలేనిదుర్బలుఁడు సమయ
మరసి యేకాంతమగుచోటి కరుగుపగిది
నేఁటిదాఁకఁ బ్రగల్భపుమాటలాడి
బెదరుచున్నాఁడు పోరికై భీముఁ డిపుడు.

ధర్మ— (తనలో) ఎట్టెట్టో చల్లాఱిన భీమకోపాగ్ని నీ మహానుభావుండె రగులు కొల్పుచున్నాఁడు. కాన నిటు చేయఁ గూడదని మందలించెదను. (జనాంతికముగా) వాసుదేవా! మహానుభావా!

చ. పగ దిగనాడి నావలని భక్తికతంబునఁ గాళ్ళసంకెలల్
దగులుప లోపల న్వగచుదంతివిధంబున నున్నవానితో
జగడము తెచ్చిపెట్టుకొని శౌర్యముఁ బోరికి నాయతంబు సే
యఁగ నీక నున్నదే! మనప్రియత్నము లన్నియు సాగనేర్చునే?

కృష్ణు— ఈ భీమునకుఁ గోప మలంకారమగునట్లు శాంతము గానేరదు. కావు నం గోపమువచ్చుటకయి యీప్రశంస తెచ్చితినిగాని యథార్థముగాదు.

ద్రౌప— (జనాంతికముగా) అన్నా! దీనశరణ్యా! పాంచాలీ పరిభవక్లేశ మనుభవించుటకుం బాలుపంచుకొను నార్యవృకోదరుని కోపాగ్నియే చల్లాఱిన ద్రౌపది యిఁక దిక్కుమాలినదే సుమీ.

భీము— (ఎకసక్కెముగా) ఓయీ! కురుపాండవ సంధివిధానధౌరేయ! పాం డవదూతా! యదునందన! ఏమంటివి! "బెదరుచున్నాఁడు పోరికై భీముఁ డిపుడు" అనియా! అవును, పుట్టువుచేతనే శూరకులభూషణం బవు నీవు నన్ననవలసినదే.

ఉ. పసితనమంద పాలొసఁగ వచ్చిననాతినిఁ జంపినాఁడనో!
పసరముతోడఁ బోరి బలవంతులలోపలఁ గీర్తిఁ గొంటినో!
ముసలిది మేని చీలికలు మూసిన మానిసి కోడిపోతినో!
మసలితినో! సదా పసులమాటున శౌర్యము నాకుఁ గల్గునే.

కృష్ణు— (తనలో) ఇదిగో! భీమమనశ్చతుష్పథంబునం గ్రోధన్యగ్రోధంబు మోసులెత్తుచున్నది. సమయానుకూల వచనరచనాదోహదంబున నదుర్ఘితీ హతమై దెస లాక్రమించునట్లు కావించెద. (ప్రకాశము) బావా! భీమసేన! ఉన్నమాటన్న నీకింత యులుకేల? బీరము లాడియాడి సమయమునకు సంధికిం బురికొల్పుచు గద దూరముగాఁ బాఱవైచి కూర్చుంటివి కాన నట్లంటి.

భీము— ఓయీ! పరాభిప్రాయానభిజ్ఞా! యుద్ధమునకే బెదరితినో, యన్నగారి యానతికే బెదరితినో తెలిసికొనలేకపోతివి.

ఉ. అంబుధు లింకుఁగాక ప్రలయాంతము వచ్చిన వచ్చుఁగాక లో
కంబులు సూర్యచంద్రు లడఁగం దలక్రిం దగుఁగాక గొప్పక

ర్త్యంబుల నెందునే నడుగుదాఁటరు పాండవు లన్నమాటకుఁ.

కృష్ణు — బావా! సుయోధనునితొడలు విఱుగఁగొట్టి చంపెదననియు దుశ్శాసనుని ఱొమ్ముఁజీల్చి నెత్తురు ద్రాగెద ననియు నీవన్నమాటలు గావా!

భీము— (బింకముతో) అవును నేనన్నమాటలే.

కృష్ణు — (చిఱునవ్వుతో) ఐనచో భీముఁడు దక్కఁ దక్కినపాండవులే యన్నమాట కడుగు దాఁటనివారు.

భీము— (ఎకసక్కెముగ) ఓయీ! అన్నమాట కనఁగా నీ కర్థమే తెలియకపోయె.

గీ. గొల్లయిల్లాండ్ర వంచించి కొంపకొంప
కరిగి పాల్వెన్న పెరుఁగు దొంగతీకమునఁ
బొట్టనిండించి జీవించినట్టి నట్టి
గొల్లనికి నీకు విద్యలగోల యేల?

గీ. ధర్మతనయుండు నడచినదారిఁగాక
మాఱుత్రొవను జనుట మా మతముకాదు
లేకయుండిన ద్రౌపదిశోక మార్ప
నీవు దిక్కైతి వన్న గొడేల మాకు?

అర్జు.— (తనలో) హాస్యవ్యాపారము మర్యాదలను గూడ నతిక్రమించుచున్నదే. (ప్రకాశముగా) ఆర్యా! భీమసేన! నేనును సుయోధనుండును దేవ సాహాయ్యంబుఁ గోరి యేకకాలంబునం బ్రార్థించినను గొండొకసెపంబుఁ గల్పించి మనయందలి పక్షపాతముచేత మనకు బాసటగా వచ్చిన యీ మహానుభావునిఁ దురుక్తులాడి విరక్తునిం జేయుచున్నావు. అతనిగోడే మనకు సర్వదా కావలసిది.

మ. చెలి చుట్టంబు మహానుభావుఁడు కృపాసింధుండు మాన్యుండు గా
క లఘుత్వంబుపుఁ బ్రశంసకుం దగునె? నీకార్యంబు సాధించుకోఁ
గల నైపుణ్యము నీ వెఱుంగ వనునే కా కట్లు మేనత్తపు
త్త్రిల మంచించుక మేల మాడఁదగదే? రోసంబు రాఁబాడియే?

భీము— అర్జునా! నీకుఁ దెలియదు. మేల మాడుటకు దేశ కాలపాత్రం బులు లేవా?

మ. బకునిం జంపితి రూపు మాపితి హిడింబాసోదరుఁ, దుష్టకీ
చకులం దున్మితి మున్న నూర్గుర, జరాసంధుఁ దురాసంధు నే
నొకడం జంపితి, నాకు భీమునకు వేఱొక్కండు తోడేల! యె
న్నక నన్నీగతిఁ బోరికిం బెదరు చున్నాఁడం చనం బాడియే?

ఉ. పుట్టినదాది పేరయినపోటుతనం బొకయింత లేక రా
పట్టితనంబుజాడఁ గనుపట్టఁగ నీయక వ్రేపలెందులం
జెట్టకుఁ జేరఁదీసి పలుచెట్టలు చేసిన యొక్క గొల్లరా
చుట్ట మెఱుంగునే? భువనశూరు సమీరకుమారు బీరముఁ.

నకు— (తనలో) అన్నగారేలొకో మన్ననకుం దగిన వెన్నునిపై నెన్నఁడును లేని చిన్నతనంబుఁ జూపించుచున్నారు. (ప్రకాశముగా) ఆర్యా! జరుగఁబోవునది యొకటియు జరుగుచున్నది మఱొకటియు నగుచున్నది.

క. జనకుఁ డగు పాండుభూపతి
చనినప్పటినుండి యేదొసంగులు రాకుం
డ నిరెత మీయన గాదే
మనలను గాపాడుచున్న మానిసి తలఁపఁ.

అట్టివాఁ డొక్కమాట యెకసక్కెమునకై యాడిన సహింపరాదా? కాక,

ఉ. గొల్లఁడు గొల్లఁడంచు వినఁగూడని పల్కుల నిట్లు దూఱఁగాఁ
జెల్లునె! యీపరాత్పరుని చెయ్వి లెఱింగియకాదె యన్నయుం
దల్లియు నెప్పుడుఁ గురుపదంబుగ నెంతురు దానినైన నీ
యుల్లములోపలం దలఁప వుత్తయమాయికకోపి వక్కటా!

భీము— తమ్ముఁడా! మద్రభూపాల ప్రథమదౌహిత్రి! ఏల యీ నిరర్థకవాక్యములు. మీరందఱ అతని యడుగులకు మడుగులొత్తిన నొత్తుదురుగాక.

గీ. చావకుండ నితఁడె సంరక్షణముఁ జేసె
నొక్క? యక్కతోడ లక్కయింటఁ

గూడఁ దోడువేదమై డాసె నీతఁడే
యిడుము లడవులందుఁ గుడుచునపుడు.

సహ— ఆర్య! కనిష్ఠసోదరా! ఏల యీయప్రస్తుతప్రశంస? మున్నెన్నఁడును మన కుపకారము చేయకయే పోవచ్చును. ప్రస్తుతమున—

ఉ. సాయము చేయ వచ్చెఁగద! శౌరి యతం డొక వేళమాడ న
న్యాయముగాఁ గుటుంబకలహంబునకున్ దగితీవు చాలు! నీ
కో యతనంబు బైటఁబడె గోడలకుం జెవు లుండునయ్యయో!
దాయలు విన్న లోకువగదా! యని యైనను మిన్నకుండరే.

అదియునుంగాక యథార్థ మాలోచించినను—

ఉ. తాతయు నొజ్జయున్ గురులుఁ దక్కినజోదులు సూచుచుండఁగాఁ
బాతకు లీడఁబోక మనభార్యను బట్టి పరాభవింప నా
నాతికి మానరక్షణ మొనర్చిన యట్టిమహోపకారి ని
న్నీతఁడు శౌర్యహీనుఁ డని యీరస మాడిన లోప మున్నదే.

భీమ— ఛీ! ఛీ! కుఱ్ఱవానిచేతఁ గూడ నింతలేసి మాట లనిపించుకొనుచున్న యీదురభిమానప్రబ్రతు కేల? ఇదిగో! ఈగదాదండమునం దల ప్రయ్యలు చేసికొనియెద. (గదపుచ్చుకొని) ఓ గదాదండమా!

చ. వెలఁదినిఁ గొల్వులోఁ బరిభవింపఁగఁ జూచుచు నున్నకూళ చే
తుల నినుఁ దాల్చి నిక్కముగ దుర్యశముం గొని తెచ్చె నీకుఁ ద
త్ఫలముగ నేఁడు వానితల ప్రయ్యలుచేసి యశమ్ముఁ గొమ్మ నీ
తలఁపగు వీరపుంగవుని తావునకుం జని నీకు మ్రొక్కెదన్.

ద్రౌప— (భీముని చేయిపట్టుకొని) ఆర్యపుత్రా! శాంతింపుము శాంతింపుము. పగఱఁ గెల్చుటయు లేక చచ్చుటయు నాఁడు చేయందగినవి కాని నేఁ డీవృథాప్రాణత్యాగ మేల? "హాస్యంబునకు దేశకాలపాత్రంబులు లేవా!" యని మీ రగ్గడించిన పలుకు మిగుల లెస్సపలుకు; పాత్ర మెఱుంగక వేళమాడిన యీ తప్పు శౌరిది కాని మీయది కాదు. నాథా! యీదీనురాలి నేమిచేసెదరు? నా పరాభవానలం బార్పవలెపదు? నే నింక ముం డనాథ నగుదునా? ముత్తైదువ నగుదునా? లేతిరేని మీ రైదుగు రేక వాక్యంబున నక్కురుకులపాంసనులం జంపి యంగటంబు మొం కొఁదలఁ జఱకు బగ్గుబగ్గునమండు మదీయపరాభవానలంబుఁ జల్లార్పుఁడు. లేదేని రణరంగంబునందైన వీరస్వర్గ మనుభవింపుఁడు; ఈ యొక్కటి దుర్మరణంబు వలనఁ బ్రయోజనం బేమి? ఓ దేవా! అజాతశత్రూ! మున్న రణ్యంబునఁ జెఱియలివాఁ డైనం దలంపక నన్నుం జెఱఁగొన్న సైంధవునిం

గట్టి తెప్పించినగాని నీ సుయోధనాదులం గట్టి తెప్పించుటకున్నైన సీతమ్మ
నను సెలవిమ్మా.

భీము— పాంచాలీ ! నన్ను వారింపకుము.

ఉ. ఎమ్మెయినైన యుద్ధమున కియ్యకొనం డు యుధిష్ఠిరుండు మ
ర్మమ్ములు దూఱనాడుచుఁ "బరాభవమో" యని యేడ్తువీవు ; క
ష్టమ్ముగ నీగతిం బ్రతుకుకంటె సుఖంబగుఁ గాక మీఁద దుః
ఖమ్మగుఁగాక చచ్చుటయె కర్జము మానికి మానినీమణీ !

ధర్మ— (భీమునిసమీపించి) నాయనా ! భీమసేనకుమార ! నీవేల యీయాత్మ
హత్య కొడంబడెదవు ! ఓ వాసుదేవా! గోరులతోఁ దునుమఁదగినది గొడ్డలి
తోఁ దునుమునట్లు చేసితివిగదా ! ఓ పాంచాలరాజపుత్త్రి ! భీమకోపా
నలంబుఁ బ్రజ్వలింపఁజేయఁ గట్టెలు విఱిచిపెట్టినట్లె మాట్లాడుచుంటివి
గదా ! ఓ సహదేవకుమార ! ఒడలునొచ్చిన నెన్నఁడును నోరులఁ జిన్న
మెత్తుమాట యననివాఁడవు గురువుల దెసనా యపచారము ?

ఉ. జూదరనైయె కళత్రమును శోకముపాలొనరించి తల్లి దా
యాదులయింట నుండఁగ మహాటవిపాలయి తమ్ముకుఱ్ఱలం
గాదిలి పెండ్లముం వెతలఁ గ్రాఁచిన యీబరి యుండ మాని యిం
దేదియు లేని భీముపయి కేగెద వేల గదా ప్రహారమా !

కృష్ణు — (తనలో) వ్యవహారము ముదురుచున్నది కావున మరల భీమసేను నెప్ప
టియట్ల కావింపవలయు. (జనాంతికముగా) ధర్మతనూభవా ! ఏమిది
నీకుఁగూడ సీవెఱ్ఱి ! ఊరక చూచుచుండుము. ఇంతలో వాయునందను
నింద్రజసన్నునింజేసెద. (ప్రకాశముగా) బావా ! భీమసేన ! ఖేద
మెఱుఁగని మీ పెద్దన్నగారి మదికిఁగూడ ఖేదము గల్పించితివి. నీవే
యిట్లుసాహసించితివేని,

ఉ. భీకరమై యగాధమయి భీష్మగురుప్రముఖోపలాకులం
బౌ కురురాట్చమూజలధి కడ్డముగాఁ జనఁగా భవచ్చమూ
నౌకను ద్రిప్పఁగాఁ దగిన నావికుఁ డెవ్వఁడు ! నీవు లేక యీ
శోకము తీఱునే ద్రుపదసూతికి నిక్కము వాయునందనా !

గీ. అన్నమాట లాలించి నీ పన్నమాట
లబ్బురము దోఁపఁజేయ నేనట్టులంటిఁ
గాని యెవ్వరు నీపరాక్రమ మెఱుఁగరు !
సమయ మిదె వచ్చుచున్నది శౌర్యమునకు.

అదియునుంగాక చిన్నతనంబునుండి దురాత్ములగు సుయోధనాదుల చెడుతలంపులకు నీవ తగియుంటివి.

ఉ. త్రాటం గట్టిరి నీటఁ ద్రోచిరి విషద్రావంబుఁ ద్రాగించి రా
రాటంబుం బడి "రీవు గీడ్వడినఁ బోరాటం బకించిత్కరం
బాటంకం బసదా" నటంచుఁగద; యాహా! యట్టి శత్రుత్వమె
ప్పాటం దోఁగితో! యెట్లు సంధియొనరింపన్ నన్నుఁ బ్రేరేచితో!

భీము— (కోపముచాలించి) కృష్ణా! మాటిమాటికి నాచేత నేల పేర్కొలింపెదవు.

ఉ. ఇంతిని గొప్పుఁబట్టికొని యీడ్వఁగఁ జూచితి నెందుచేతనో
వంత దురంతమైన వనవాసముఁ జేసితి నెందుచేతనో
శాంతిసహించి యొక్కనిదినం గొలువుండితి నెందుచేతనో
శాంతి వహించి యీపగిది సంధి కొడంబడు టందుచేతనే.

ఐనను సంధివచన ప్రస్తావంబున నాంబికేయునితో నిట్లనుము.

ఉ. పాండునృపాలకుండు జనవంద్యుఁడు నీయనుజుండు రాజ్య మా
తండె భరించె మున్న చనుదాఁ కిపుడింటికిఁ బెద్దవయ్యు నం
ఘుండవు గాన నీ సుతులతో సరిగా ధరఁ బంచిపెట్టి పై
నుండుము నీకుమారుల మహోదయముల్ వినుచున్ సుఖంబుగన్.

అట్లు పంచిపెట్టుట కంగీకరింపవేని,

ఉ. ఆలములోన నీసుతులనందతి నొక్కగదాభుజంగికిం
బాలొనరించి వచ్చిన నృపాలురు చూడఁగ నిచ్చువాఁడ నే
నూళులు తిండికిం బ్రతికియుండిన మీకును "దాసి" వంచుఁ బాం
చాలిని నవ్వినట్టి దొరసానికి భానుమతీవధూనికిన్.

ద్రౌప— నాథా! కార్తికరాకాసుధాకరతరుణకిరణసమశీలంబులగు నీచల్లని మాటలచే నామనోవ్యథ తీఱినట్లే యున్నది.

భీము— ఓ పాండవగేహిని! పాంచాలరాజపుత్రి!

క. కొలఁదిదినంబులలోఁ గురు
కులకాంతలకుతికి త్రాటి కొలుకులతోడన్
గులికెడు నీకనుఁగొలుకులఁ
గఁకీ! యానందబాష్పకణములు జాఱున్.

కృష్ణు— (తనలో) ఇప్పటికి మదించి యాలానం బూడఁబెఱికి చెలరేఁగిన మత్తగజము మరలఁ గట్టు కొయ్యకుం జేరినది. (ప్రకాశము) ఓ అర్జున నకుల సహదేవులారా! మీరు చెప్పవలసిన మాట లేమైన నున్నవా?

అర్జు. గీ. నుడువవలసిన దంతయు నుడివె ధర్మ
తనయుఁ; డీ వేగుచుంటివి దైవమూర్తి
వింకఁగొద వేమి సంధిఁగావింప నొండె
పోరుఁబొసగింప నొండె నీభారమయ్య.

ఐనను మనుజసహజంబగు నహంకర్తృత్వంబున నానుడువుపలుకు లుపదేశంబని తలంపక యాకర్ణింపుము.

క. చిరభుక్తమైన నేల న
చిరానుభూత యగు పేర్మియసింబలె బలవ
త్తరమగు విధిచేఁ గాకె
వ్వరు విడువంజాతురయ్య వసుదేవసుతా!

అందును భీష్మద్రోణకృపాశ్వత్థామప్రముఖనిఖిలమహారథికసమవష్టంభనద్విగుణీకృతావక్రవిక్రమగర్వుండును నయవినయవశీకృతసకలరాజచక్రతోష్టూయమానసంపత్పూర్వుండును దుశ్శాసనాదిసహోదరశతకభుజావరణసంభావితసహజధైర్యప్రాసాదాసాదితరాధేయాభిధేయసింహాసనాసీనుండును సహజదుశ్శీలకపటసదుపాయానుశ్రవీకృతతాతుండును నగు సుయోధనుం డేలవిడుచును?

గీ. వాఁడిములు మోపినంతైన వసుధ యొసఁగఁ
ననుచు సూచించెఁగద సంజయుని మొగమునఁ
బాలనక నిక్క మైమూళ్ళ చాలుననిన
లబ్ధిలేదుగదా! యేల లాఘవంబు?

అది నాతోఁచినతెఱం గది యట్లుండ సభాముఖంబునఁ గులవృద్ధగు గాంగేయునితోడను గులాచార్యుండగు కుంభసంభవునితోడను నామాటలుగా నిట్లనుము.

ఉ. సూతునిమైత్రిచేఁ బగఁబూఁ జొచ్చినగొంటు సుయోధనుండు; మీ
రాతనిపట్లవా రగుట న్యాయమ? గాండివధారి నయ్యు నే
భీతిలుచుంటి నేమనుచుఁ బెద్దలతో నని సేయువాఁడ నో
తాత! గురుండ! మీరయిన ధర్మముగాదని మందలింపరే!

అట్లు మందలింపఁ జాలరేని—

గీ. పాత్రులే యొనరించి రపాయమనుచు
క్షాత్రులే చేసినా రపచారమనుచు
నెడఁదలోఁ దలపోయక యిం డభయము
సదమదించును వాని మా సాయకములె.

కృష్ణ— సమదశాత్రవకులఫణాధరనకులా! నకుల! నీ యభిప్రాయమేమి?

నకు— జనార్దనా!

గీ. అడవిలో నున్నవేళ రాజ్యాశ మనకు
లేదు, వారికి దుర్బుద్ధిలేదు నిజము;
కష్టములకోర్చి తుదకు భాగంబు గోర
నప్పటికి వారికిట్టి దురాశపుట్టె.

చ. అహమిక చేత నట్లుకబురంపిన నంపిరిగాక, మొన్న గో
గ్రహణమునాఁటఁ గోలె మది గర్వము దోఁగక పోరు, పాండవ
ప్రహరణముల్ కరం బొడలిపట్లకు నాఁటినద్రోణుఁడుం బితా
మహుఁడును దక్కు-వారలును మాన్పుదు రేగతి సంధి సేఁతకున్!

పోరికిం గాలు ద్రవ్వకుండుటకు మనబలంబుమాత్రము సామాన్యమే! ధర్మతనయుండు విల్లుపూని నిలిచిన నెదురువాఁడెవ్వఁడు? తక్కిన పాండవులయు విరాటమహిపదధృష్టద్యుమ్న కాశీపతి చేదిపతిప్రముఖు లగు మహాయోధులయుఁ జక్రరక్షకుఁడవగు నీయొక్కయు బలపరాక్రమంబు లెఱుంగనివారే! ధర్మతనయుండు పోరికిం జొరనీఁడను గట్టితలంపు గలిగి యున్నంతవట్టును వారిట్టి ప్రగల్భంబులే పల్కుచుందు; రయినను సంధినడపుచు యుద్ధమునకుఁ గూడ రంధ నపుచుండుము.

ఉ. పోరికి సిద్ధమై యడుగఁ బోయినవారము గాన వారు మా
దారికి రాకపోవుట విదారితకౌరవకంఠరక్తధా
రారమణీయరక్తిమ మరాళకరాళపృథాకుమారసే
వారతి పీఁగియున్న కరవాలములం బదు యోగ ముండినన్.

(తెరలోఁ బెద్దకలకలము తరువాత)

క. ఆసన్నంబయ్యెను ముర
శాసన! దేవా! ప్రయాణసమయం బిదె భే
రీసముదిత మగురవము ది
శాసముదాయంబు వగుల జయముగ మ్రోఁగెన్.

కృష్ణ— ఇదిగో! వచ్చుచున్నాను. చిన్నబావా! సహదేవ! నీతలంపు వ్యక్తీకరింపుము.

సహ— క. అడిగితిరిగానఁ జెప్పక
విడుచుట ధర్మంబుగాని విషయము గానన్
నుడివెదఁ దప్పున్నను లో
నిడుకొని నాపల్కులు క్షమియింతు రటంచున్.

ఉ. బీదతనంబు వచ్చెనని పెద్దలు నల్గురు కూడి చేసినం
గా దనరాదుగా కపుడు కౌరవనాథునితోడ వేడుకన్
జూదములాడి ధర్మతనుజుండు సమస్తముఁగోలుపోవ భా
గోదయ మేగతిం గలుగునో మన కచ్యుత! నిర్ణయింపుమా.

పాంచాలీవరరూపంబుగా నాంబికేయుండె మనరాజ్యంబు మనకిచ్చె నంటిరేని.

మ. విదితంబే పృథివిం గలట్టి సకలోర్వీనాథులుం జూడ ద్రౌ
పది కయ్యంధనృపాలకుండు పరిభావంబైన పైనిచ్చుటల్;
గదయున్ గాండివమున్ ధరించువారలే కంజాక్షి యార్జించిన
ట్టిది సీ! సీ! యని రోయ కక్కటికకూటిం బేర్మి నాసింతురే?

పోనీ, మాయదురోదరంబునన్ గెలిచిన గెలుపు గెలుపుగాదంటిరేని.

మ. అభిమానంబు గలట్టిరాజుల కసత్యాలాపముల్ కూడునే?
ప్రభువుల్ గారె నలాదు! లీకరణిగాఁ బాటించిరే? గెల్తురే
యుభయుల్ జూదములం? బరాభవము రా, నోడొందువాఁడేల ధ
ర్మభయంబుం గొని గెల్చువారలని ధర్మంబంచు నగ్గించెడున్?

కావునఁ బాలుమాట తలపెట్టక బలపరాక్రమంబునకు ఫలంబుగా రణభేరి మ్రోగింపుఁడు.

మ. వారల యొక్కండన నేటిమాట? బలవంతుం డైవ్వఁడో వాని దీ
ధర; పోరన్ జయమో పరాజయమొ రాదా! గెల్చి రాజన్యులం
దఱు మెచ్చన్ ధరయేలుకొంద మటుకాదా! చచ్చి స్వర్గంబునం
దిరుగన్ వచ్చును మంచిక్షత్రియుల కింతే యొండు లే దెచ్చటన్.

కృష్ణు— (చేతితోఁ జఱచుచు) బావా! చిన్నవాఁడవైనను నామనసు వచ్చిన మాటంటివి.

సహ— వాసుదేవా! యీసంధికి సుయోధనుం డొడఁబడఁడేమో యని మాయన్నలును నీవును గడుఁజింతిలుచుంటిరి గాని యతం డంగీకరించుట కేవిధమైన సందేహమునులేదు. ధర్మవిదులైన మాయన్నలు యశంబు సంపాదింతురు గాక!

ఉ. అన్నలు ధర్మవర్తను లటన్న యశం బొకఁడున్నఁజాలు వా
రన్నరనాథుసంధికయి యాస వహింతురుగాక! వారితో

నెన్నటికేని యాలమది యే నొనరింపకతీర దట్లు కా
కున్నఁ బరాభవ మ్మడుగునో? తల ద్రౌపది యెత్తనేర్చునో?

ద్రౌప— అన్నా! దీనశరణ్యా! యీ యాడుకుయ్యిఁగూడ గొంచెమాలింపుము. వేదీమధ్యంబునఁబుట్టి ద్రుపదరాజునకుం బట్టినై ధృష్టద్యుమ్ననకు సోదరినై స్వయంవరంబున సకలరాజన్యచక్రంబులం జించి చెండాడిన మేటిదొర లైదుగురకుం గులసతినై విశేషంబుగా నీకుం జెలియలినై యొక్క— కులపాంసనుం డంటరానిసమయంబునం గొప్పువట్టికొని యీడ్చి కొల్వులోపలఁ గట్టుపుట్టంబు లూడ్చి పరిభవించిన నోర్చితి; పండ్రెండు వత్సరంబులు వనవాసంబును నొకయే డజ్ఞాతవాసంబును సలిపితి; నిన్నియిడుములకోర్చి బ్రతికియున్నందుకు ఫలముగా నా కౌరవచండాలుర చావు వినుట తప్పఁ దక్కిన కల్మిలేముల కాసించుదానఁ గాను; వేయేల? యిమ్మేటి మగలకుఁ బౌరుషంబువచ్చునని కదా! నేఁటికిని దుశ్శాసనాచ్ఛిన్నంబులగు తలవెండ్రుకలు ముడువక కట్టుపుట్టంబు విడువక జీవించుచుంటి; నిప్పటికిని నా ప్రతికూలదైవంబు పదలి నా నోములు ఫలింపకున్నవి.

కృష్ణు— అమ్మాయి! యిఁకఁ జాలింపుము. నీమనోగలం బెఱుంగుదు.

గీ. మున్ను నీవు సహించినయన్నినాళ్ళు
నైఁప నక్కఱలేదు సంతాపభరము;
వచ్చుచున్నది నిజము నీవలెనె కురుక
శత్రములుగూడ నేడ్చుకాలము పురంధ్రి!

(తెరలో "ఆసన్నంబయ్యెను మురశాసన" అను పద్యము మరలఁ జదువుదురు)

కృష్ణు — బావలారా! నాకండఱు సెలవిండు. ముహూర్తము డాయవచ్చినది.
(అందఱును గొంతదూరము సాగనంపుదురు)

ధర్మ— (తనలో) కురుకులదేవతలారా! ఓ పంచభూతములారా! నాయెడల దయయుంచి మావంశము నాశీర్వదింతురుగాక.

పరమకృపాళు మాయుభయపక్షమువారికిఁ జుట్టముం జరా
చరమయ మైన యీజగము సర్వముఁ బ్రోవఁగఁ జాలువాని ధీ
వరు వసుదేవనందనుని వారలయొద్దకు సంధిసేయఁ బ్ర
వ్యములు నిదె పంపుచుంటి బలిమాలుచు యుద్ధభరంబు మాన్పఁగన్.

(ప్రకాశము)

గీ. తిమ్మియనఁ దిమ్మియగు నిది బ్రమ్మియనఁగ
బ్రమ్మియే యగు నీవు, వేపలుకులేల
యిచ్చవచ్చినయట్లు చేయింపుమయ్య!
యిరుతెగలలోనఁ గానివా రెవరు నీకు ?

(అందఱును నిష్క్రమింతురు)

గద్య.

ఇది శ్రీ ... తిరుపతి వేంకటేశ్వరులచే రచింపఁబడిన
పాండవోద్యోగమునందు ద్వితీయాంకము.



ఓం.

శ్రీమత్సరదేవతాయైనమః.

# పాండవోద్యోగము

## తృతీయాంకము.

(పిదప వృద్ధపురోహితుఁడు ప్రవేశించును.)

వృద్ధు— గాంధారీ సహితుండగు నాంబికేయునిచే సపరివారంబుగా మురారిం దమయింటికి యథావిధిగాఁ దోడుకొని రమ్మని నేనే నియోగింపఁబడి యు మధ్యమ పుత్రుండగు త్రివేదిం బంపించితి. పెద్దవాఁడగు ద్వివేదిని రాజాగారంబుననే యుండ నియమించితినిగదా ! ఇఁకఁ జంటివాఁడు చతుర్వేదియు నేనును మాయింటి కతిథులై చనుదెంచిన మునీంద్రులకుం దగిన యాతిథ్యముఁ గావించుచుంటిమి.

ఉ. ఎన్నఁడు రాని పెద్ద లిపు డింటికి వచ్చిరి వారి డించి నేఁ
జన్న శపింతు రాన్నృపతిసద్మములోనికిఁ ; బెద్దవాఁడఁ నా
టన్ననుఁ బిల్వనంపి రకటా ! యిపు డేమియొనర్చువాఁడఁ గా
నున్నది కాకమానదు సుయోధనుఁ డేమియొనర్చునో తుదిన్.

గీ. సత్యవతి పెంచెనఁట మున్ను జనని లేని
పిల్లవానిని మాతండ్రి నెల్లయాజి,
నంబికాదేవి పెంచె నన్నట్లు ; నొక్క—
యీడువారము ధృతరాష్ట్రనృపతి నేను.

కావునఁ జిన్న నాటనుండియు నతనికి ముఖ్యమిత్రుండనై పౌరోహిత్యంబు నెఱి సామ్రాజ్యమే యనుభవించితి. శ్రీకృష్ణునిరాక సంధికొఱకని యెఱింగి నాతో నేమేమో యాలోచించుటకే కాఁబోలు వైయాసకి నాకుం గబురంపె ; నింతకుఁ గొఱుకరాని కొయ్యలు సుయోధనాదులు తండ్రిమాట వినరు. భరతకులంబున కేదియో చేటుమూఁడినది. ఛీ ! ఇంత దిక్కుమాలినయాశ కూడదు. పాపము పాండవులు బిచ్చగాండ్రవలె నైదూళ్ళిచ్చినఁ జాలుననఁగా నేల యీరాదు ? సాక్షాత్ప

రాత్పరుఁడు కృష్ణుఁడు సంధిచేయవచ్చెనని యంగీకరించునేమో (పైదవి విడిచి) అబ్బే ! వీనికి గురువులేఁడు దైవములేఁడు. వీని నింతనాఁట నుండి యెఱుఁగుదును.

క. కర్ణుఁ డనుకర్ణధారుఁ డే కడకుఁ ద్రిప్పు
నాకడకుఁ బోవుఁ గురునాథుఁ డనుకలంబు ;
పలుఁగు లాతనితమ్ముల్ లాపడవపలుపు
లాదరికె లాగఁ జూచెద రనుకలంబు.

ఓరీ ! శకునిగా ! నీవే యీ భరతకులనాశంబు దెలుపు తిత్తిరి శకునివి. ఓరాధాకుమారా! ఒడలి కవచకుండలములు గూడఁ దెగఁగోసి యిచ్చిన మేటిదాతవు, శరీరములే వేఱుగాని నీవేసుయోధనుండవు సుయోధనుఁడే నీవు కావున,

ఉ. ఈగికి వెన్కఁదీయకు మహీంద్రశయానుఁడు పాండుపుత్ర భూ
భాగము సంధిపేరిటి నెపంబున నిన్నడుగంగ వచ్చెఁ జూ

(ఆలోచించి) అయ్యో ! ఎంతవెఱ్ఱినైతిని, నిన్నిది యొక్కటియే కోరఁదగనిది,

భాగము మాటటుంచుము సెబా సవమానము సేయకుండఁగా
నేగతి వచ్చెనో యటులనే చన నిచ్చినఁ జాలుఁ గృష్ణునిన్.

(ఆకాశమువంకకుఁ జెవియొగ్గి తనలో) ఎవరో తలుపుదగ్గఱ బిగ్గరగా నఱచుచున్నట్లున్నారు. (ప్రకాశముగా)ఎవరయ్యా ! అఱవఁబోకుఁడు మార్గాయాసంబునం బడలి జడదారులు కునుకుచున్నారు. (మరల నాక సమువంకఁజెవియొగ్గి తనలో) ద్వివేదిమాటవలె నున్నదే! (ప్రకాశముగా) నాయనా ! ద్వివేది ! పెరటితలుపుదారిని రమ్ము. ఈగుమ్మము తెఱచుటకు వీలులేదు.

ద్వివేది— (పెరటితలుపుదారిని ప్రవేశించి) తండ్రీ ! నమస్కారము.

వృద్ధు— సుఖీభవ ! (ఆశీర్వదించి) నాయనా ! మురారిని యథావిధి పురస్సరంబుగా మన త్రివేది ముసలిరాచనగరికిం దోడికొనివచ్చెనా ! అచటి విశేషములేమి ?

ద్వివేది— ఇప్పటి కేవియును లేవు.

చ. విదురునితో నెదుర్కొని త్రివేది యొనర్చిన యర్ఘ్యపాద్యసం
పదఁ గొని వారితోఁ గలసి పట్టణకాంతలు చల్లు సేసలె
ల్లఁ దనశిరంబునం బడ విలాసముగాఁ జనుదెంచెఁ గామినీ
మదనుఁడు శౌరి మత్తగజమందగతిన్ ధృతరాష్ట్రునింటికిన్.

వృద్ధు— తరువాతఁ దరువాత.

ద్వివేది— మత్సమర్పిత చందన తాంబూలాదులు కరంబునం దాఁకి సర్వాశ్చర్యం గారితం బగు బంగారుగద్దె మీఁదఁ గూర్చుండి చుట్టుం బరివేష్టించి యున్న తాసనంబుల నున్న మనదొరలతో నుచితప్రసంగంబు గావించుచుఁ గొంతతడవుండి—

క. విదురాదులయింటికిఁ జని
యెదఁ గా కనిలేచి యంధనృపదంపతులం
జదురున వీడ్కొని కుంతీ
సదనమునకుఁ జనియె విదురసహితుం డగుచున్.

వృద్ధు— కన్నకొడుకులు కానలపాలై కుందుచుండ దాయాదులయింటం గుడుచుచు నడలుచున్న కుంతి కన్నుల కిదియే మొదటిపండువు. తరువాతఁ దరువాత.

ద్వివేది— తరువాత దుర్యోధనమందిరంబునకుం బోయి యచట "విందారగించు" మని యెంత వేఁడినను బగఱయింటఁగుడుచుట తగదని తగిన సమాధానంబు చెప్పి విదురునింట భుజించుటకుం జనియె. నేనును మరలి వచ్చితిని.

వృద్ధు— శ్రీకృష్ణుఁ డేగునప్పటికి రారా జేమిచేయుచున్నాఁడు?

ద్వివేది— కర్ణశకుని సైంధవ ప్రముఖులతోఁ గొల్వు దీర్చియున్నాఁడు.

వృద్ధు— (పెదవివిఱిచి) కావుననే శ్రీకృష్ణుఁడు కౌరవరాజు ననాదరించినాఁడు అదిగాక మొదటినుండియు బలరామునకు సుయోధనునియందును శ్రీకృష్ణునకుఁ బాండవులయందును నభిమానమెక్కుడు. ఈయభిమానముల కతముననే కదా! ఆపెండ్లి కన్ని చిక్కులు ఘటించినవి!

చ. "పరమదరిద్రుఁ డే నొసఁగఁ బట్టిని ఫల్గుననూతి" కంచు సం
బరపడి సీరి లక్ష్మణ కుమారకు నేరి యొసంగెఁ బెండ్లికిం
దరలితి మావివాహపు విధానము లేమనఁ! జావుతప్పి వ
చ్చిరి దొర, లాఘటోత్కచుఁడు చేసె వివాహము పార్థసూతికిన్.

ద్వివేది— వెనుక సుభద్రమ్మగారిని గూడ బలరాముఁడు దుర్యోధనునకే యీఁదలంపఁగాఁ గృష్ణుఁడు పార్థునకుఁ బెండ్లిచేసె నని విందుము.

వృద్ధు— అవును. మొదలనుండియుఁ గృష్ణునకుఁ బాండవులయందే పక్షపాతము.

ద్వివేది— నాకు సెలవిండు. త్వరగ భుజించి నురల సభాముఖంబున కీ ఋషుల నందఱిని వెంటనిడుకొని పోవలయు.

వృద్ధు— రాయబారపు సభయేనా! భీష్మాది కులవృద్ధులును, ద్రోణకృపాశ్వత్థామాది గురుపరంపరయు, శకుని మొదలగు బంధువులును, కర్ణవికర్ణాది సామంత రాజులును, దుర్యోధనాది కుమారులును గొలువఁ బుట్టినదిమొదలాంబికేయుండు జేయు నోలగంబులలో నిదియే నిండోలగంబు (తనలో) నేనుగూడ మెల్లమెల్లన నేగుదునా (ఆలోచించి) కననా? విననా?

గీ. యదుకుమారు పల్కు లాలించెదనటన్న
నతనిరూపు చూతునా! యటన్న
కనులు కానరావు; వినరావు కర్ణంబు
లేమిచేయువాఁడ నేగి నేను.

ద్వివేది— అయ్యా! నాకు సెలవిండు, నేను మరలవచ్చి సర్వము వినిపించెద.

వృద్ధు మంచిది. నేనును రవంతసేపు విశ్రమించెద.

(నిష్క్రమింతురు.)

(ఇది విష్కంభము.)

(పిదప భీష్మద్రోణులతో గాంధారీ సహితుఁడైన ధృతరాష్ట్రుఁడు ప్రవేశించును.)

ధృత— (తనలో)

క. దుర్యోధను నంపితి శుభ
చర్యన్ శ్రీవాసుదేవు సభకుఁ బిలువఁగన్
మర్యాదగఁ బిలుచునో యీ
యార్యేతరుఁ డతనిఁ జెనకి యవమతి గనునో?

(అంత విదురసాత్యకుల చేయూఁతఁ గొని శ్రీకృష్ణుఁడును వెనువెంట దుర్యోధనాదిదుష్టచతుష్టయమును కృపాశ్వత్థామవికర్ణులును ప్రవేశింతురు. భీష్మాదులందఱును లేచి నిలుచుందురు.)

భీష్మ— వాసుదేవా! నీవాయాసనము నధిష్ఠింపుము. (చేతఁజూపును)

కృష్ణ— (చేతఁజూపి) ఈసభావిశేషములఁ దిలకింపఁగోరి నానాదిక్కులనుండి మహామును లనేకులు వచ్చియున్నారు. ముందు వారి కాసనము లేర్పఱచి పిదప మనము కూర్చుండుట యుక్తము. (ఆకాశమువంకఁ జూచి) మఱియు,

క. నాకమునుండి వచ్చిరి
లోకైకనుతుల్ మునీంద్రలోకము వారిన్
దేఁకువమై నర్చించి క
దా ! కూర్చుండుటకు మనకు నవకాశ మగున్

(నారదాదులు ప్రవేశింతురు. అందఱును గూర్చుందురు. కర్ణదుర్యోధను లొక్కటే యాసనము నధిష్ఠింతురు.)

కృష్ణ— (చిఱునవ్వునవ్వుచు) మామా ! సత్యవతీపౌత్ర ! ధార్తరాష్ట్రులకును బాండవులకును సంధిగావించి యీరాజలోకము నెల్లఁ గాపాడుమని నిన్ను యాచించుటకై పాండవదూతనై నీయొద్దకు వచ్చితిని.

క. తమ్మునికొడుకులు సగపా
లిమ్మని రటు లిష్టపడవ యేనియు నైదూ
ళ్ళిమ్మని రైదుగురకు ధ
ర్మమ్ముగ నీతోఁచినట్లు మనుపుము వారిన్.

క. తనయుల వినిచెదవో ? యీ
తనయులతో నేమియని స్వతంత్రించెదవో ?
చను మొకదారిని లేదే
ననియగు వంశక్షయంబు నగుఁ గురునాథా !

మ. చదువున్ నీతియు శాంతి దాంతియు విశేషఖ్యాతియుం జాతుకీ
కదనాటోపములుం గలట్టి నృపలోకంబెల్ల నగ్గించు సం
పద సొంపారుకులంబు మీకులము మీవారందఱున్ నిత్యస
త్యదయాశాలులు కీర్తి నిల్పుకొనుఁడయ్యా ! పాండురాజాగ్రజా !

చ. పతితులు గారు నీయెడల భక్తులు, శుంఠలు గారు విద్యలం
జతురులు, మంచివారు, నృపసంతతికిన్ దలలోనినాల్కలు, న
చ్యుతునకుఁ గూర్చువారు, రణశూరులు, పాండవు లట్టివార లీ
గతి నతిదీనులై యడుగఁగా నిఁక నేటికి సంశయింపఁగన్.

ఫలితార్థంబుఁ జెప్పితి నట్లు చేయఁదలంపనిచో వా రేగురును ద్రౌపదియు వేర్వేఱ నీతోఁ జెప్పుమనిన మాటలు ప్రకృతానుపయోగంబు లగుటంజేసి విరమించితి.

ధృత— అల్లుఁడా ! వాసుదేవ ! సర్వమెఱింగియు నన్ను నెపపెట్టుచున్నావు.

ఆ. గ్రుడ్డినగుటచేతఁ గొంతకాలంబేలెఁ
బుడమిఁ బాండురాజు; కొడుకు లిప్పు

డేలుకోఁ దొడంగి రీకారణంబున
గ్రుడ్డిదయ్యె మాటగూడ నాకు.

క. కొడుకులు తండ్రుల మాటల
కడుగైనను దాఁట రనెడి యశమున కీ భీ
ష్ముఁడె చిట్టచివర మా వం
గడము జనించినది మొదలు కంసధ్వంసీ !

విదు— (జనాంతికము) అన్నా ! నిన్న శ్రీకృష్ణుని రాకవిని పరమానందంబు నంది యయ్యనఘున "కదియిచ్చెద నిదియిచ్చెద" నని యుప్పొంగితివి కదా ! యీర్లైదుమాళ్ళను నతనికే యిచ్చితి ననుకొని యీ కయ్య మాప రాదా ? మన కిట్టిసమయము మరలఁ దటస్థింపదుసుమా ! యోజించు కొనుము.

ధృత— (వినీవిననియ ట్లూరకుండును)

కృష్ణు— (తనలో) ఈ ముదుసలి యప్పుడే తన వాచాకౌటిల్యమును జూపించు చున్నాఁడు. (ప్రకాశముగా) ఎఱుఁగుదు; నైనను బెద్దవాఁడవని విన్నవించితి.

ఉ. అట్టికులంబునం బొడమి యట్టి మహాత్ముఁడు పాండురాజుతోఁ
బుట్టిన వాఁడుగాఁ బుడమిఁ బొంపిరివోవఁగ నేలినట్టి నీ
కట్టిన పాపమెట్టిదియొ కష్టము రానయియుండెఁ బుత్రులం
బట్టి, యిదెట్టు లీఁగెదవొ పార్థివసత్తమ ! నీతివిత్తమా !

నీ యోపినకొలఁది చెప్పిచూతుము, కార్యము దుర్భరంబు కావున నింతగా నీతోఁ గూడఁ జెప్పవలసివచ్చినది. వారిచే శుశ్రూష నే చేయించుకొనెదవో సంగరము నే చేయించుకొనెదవో యది నీయందున్న యది. ఇందులకును నందులకు వారు సంసిద్ధులై యున్నారు.

ధృత— వాసుదేవా ! నాయోపినంత నీయెదుటనే యుపదేశించెద.

కర్ణు— నందనందనా ! అతఁడు పాపమే గట్టెనో పుణ్యమే గట్టెనో ప్రకృతమున కది విచార్యముకాదు. అధికప్రసంగము గావించుటకుఁ బ్రాజ్ఞు లొప్పరు. దూతనై వచ్చినవాఁడవు నీ వక్తవ్యాంశమేదో చెప్పుకొనుము.

భీష్మ— (కోపముతో) ఓయీ! సూతపుత్రా ! నందనందనునిమాటటుంచుము. నీకీ యధికప్రసంగమునకై యెవ్వ రధికార మొసంగిరి ?

క. చెప్ప దొరకొన్న విషయం
బొప్పో ! తప్పో ! ముగింపకుండఁగ నడుమన్

దప్పనుట తగునె సభలో
నెప్పుడు గురునంతవాని కేనియుఁ గుమతీ!

ద్రోణు— రాధేయా! శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రుని పాపమునకుఁ గారణము చెప్పనే చెప్పినాఁడు. మఱియుం జెప్పఁదలఁచినఁ జెప్పఁగలఁడు. నడుమ నీకీ దుందుడు కెందులకు?

చ. సరసముదారి బోకె దిరిశత్రియెఱుంగక పాడిమాలి భూ
వరునకుఁ గూర్చువాఁడనని వా యెటు వచ్చిన నట్లు పేలఁగా
నురు వరుడెంచునో? యొరు లహో! యని మెత్తురొ? సూతపుత్ర! న
ల్వురు జనుత్రోవఁగా నడువఁబో విది యెచ్చటి పాపకర్మమో!

దుర్యో— (ఊరకుండు మని కనుసన్న చేయును)

కర్ణు— (ఏకసక్కెముగా) ఓ కుంభసంభవా! ముదిమిచే మది తప్పిన గాంగే యునితోఁబాటు నీకును మతి పోయెనాయేమి!

శా. కూడుం గుడ్డయొసంగి ప్రోచువిభు నొక్కం డెవ్వఁడో వచ్చి దూ
ఱాడం జూచుచు నూరకుండుటకు ద్రోణాచార్యుఁడో భీష్ముఁడో
కాఁ డీకర్ణుఁడు; లోన నొండుఁ బయి నొక్కం డూహ లేకుండ నీ
యోడం బ్రాణములైన వీడుటకు వీఁ డున్నాఁడు సిద్ధంబుగన్.

ద్రోణు— క. ఆతని వృద్ధత్వమ్మును
నీ తారుణ్యంబు మాకు నీకును ధనువున్
జేతఁ గొనువారికెల్లఁ బు
రాతనగురుఁ డైన పరశురాముఁడె యెఱుఁగున్.

అశ్వ— ఓయీ! రాధేయా! సుయోధనదయాసంపాదితాంగదేశ సామ్రాజ్య ధౌరేయ! సేవకుఁడ వగు నీ కుచితంబు లగుధర్మంబులు భీష్మాదులకుఁ గూడ నుపదేశించుచున్నావు. న్యాయపక్షపాతులకుం బ్రభుచిత్తాను సరణం బనావశ్యకము.

ఉ. గొంటుతనంబుచేఁ దలఁపఁగూడనిచెయ్వులు చేసె రాజు నీ
యంటున నిక్కమంచు సభనందఱకున్ విశదంబు చేసె నీ
కంటస మార; పల్కుబడి కందువచందము లేకయున్న నీ
వింటరపాటుఁ జెందుటకు హేతువు చెప్పుము సూతనందనా!

వికర్ణ— ద్రోణాత్మజా! న్యాయపక్షపాతులకుం బ్రభుచిత్తానుసరణం బనావశ్య కం బనికదా! యిపు డుగ్గడించితివి. కాని యిది యీ గాంగేయాదుల యెడలం బ్రయోగింపఁ దగనిది. ఏమంటివేని,

మ. అభిజాతత్వము గల్గు చాన సతి యంటై యుండఁగా దుర్మదా
రభటిం గొల్చున కీడ్చి తెచ్చి కటివస్త్రం బొల్వఁగా, "దాసి వీ
సభలో నిందు వసింపు" మంచుఁ దొడ యాస్ఫాలింపఁగాఁ, జూచి రా
జభయంబుం దిగఁద్రావి తేని కిది దుష్కార్యం బనంజాలి తే?

అశ్వ — ఓయీ! వికర్ణ! అది యొక గొప్పకార్య మని సుయోధనాదులం బ్రశంసించిరా? నీవు నాలుగు ధర్మవాక్యములు నాఁడు నుడివినంతనే వారికన్నఁ బెద్దవై తివా? దానికంతకుం బ్రథమకారణంబు నీ తండ్రియే కదా?

క. మోహితులు కన్నుఁ గానక
సాహసకృత్యములు చేయుసమయంబున ని
ర్వాహకము లగునె వలదని
బాహిరముగఁ జేయు ధర్మవచనము లెందున్.

కావునఁ దులువ లొనరించు దుష్టచేష్టలు నివారింపఁబూనుకంటెఁ బెద్దల కూరకుండుటయే పరమధర్మము. "అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫలముచ్యతే" యని శాస్త్రంబులు వాకొనుచున్నవి.

చ. చెనఁటులు చేతఁగాని పనిచేసి కొలంబున కెల్లఁ గీడు మూఁ
డునటులు మించినందుల కిటు ల్చనుదెంచె ఫలంబు తోడుతో
డన కనుఁగొమ్ము వచ్చిరి హుటాహుటి నేఁటికిఁ బాండురాజనం
దనులు చలంబు మీఱఁ గదనంబునకుం గురురాజుమీఁదికిన్.

దుర్యోధనుండు సకుటుంబముగా నశించుమపాయంబు లంగరాజునకుఁ దప్పఁ దక్కినవారికిం దెలియవు. లేదేని,

ఉ. కచ్చియ మాన్పి కౌరవులఁ గాచుతలంపున సంధి సేయఁగా
నచ్చిక నేగుదెంచి హరి మంచియు చెట్టయు చెప్పుచుండఁగా
నచ్చపురాజభక్తి గలదంతయు వెల్లడిచేయుభంగి నీ
మచ్చరి సూతపుత్రుఁ డభిమానముచేఁ గలహింప నేటికిన్?

కృప — (ఎక్కసక్కెముగా) నిరభిమానబ్రాహ్మణ కులసార్వభౌమ! లక్షణ మాత్రపరిజ్ఞాత ధనుర్వేదసార! ఆచార్యపుత్ర!

చ. కదనము సేయ వచ్చిరని కంది ముకుందుని మాటచొప్పునం
బెదరి సుయోధనుండు తనబీరము నీరముపాలు చేసినం
బెదరఁగ సూతనందనుఁడు వేఁడుఱ గాఁడు చతుస్సముద్రముల్
చదరముగల్గు నీపుడమి శాత్రవశూన్యముఁ జేయకుండఁగన్.

అశ్వ— (పట్టరానికోపముతో) ఓరీ అలీకవాచాల! రాధానందనా! ఇంకెన్ని నాళ్ళు బీరములు పల్కెదవురా?

మహాస్రగ్ధర.

ప్రళయాంభోదాంబుధారావిసరమువలె నుర్వీవియన్మధ్యభాగం
బులు నిండన్ వేలుబాణంబులను వదలు కిల్వ్యాని గాండీవి "కర్ణా!
నిలు మోరీ! పాఱుబోతా! నిలు నిలు" మనుచు న్నిన్ను వెన్నాడఁజూడం
గలకాలం బేగుదెంచెం గదవము వల దుగ్రంపుయుద్ధంబునందున్.

ధృత— తండ్రీ! గురునందన! మనమందఱముం గార్యార్థులమై వచ్చిన వాసుదేవు నావలకుం బంపు యోజ యోజింపవలయునుగదా! మీ కీ యకారణ పరస్పరకలహము లేల? రాధేయా! నీ విఁక సమాధేయవాక్యంబులకై ప్రయత్నింపుము. పెద్దవాఁడ ననియయిన మీరెల్లరు నా విన్నపము చెల్లింపుఁడు. (చేతులు సాచి వెదకుచు) మా సుయోధనుఁ డెక్కడ? నాయనా! దగ్గఱకు రమ్ము.

దుర్యో— (తనలో) ఇతఁడేమేమో కొఱగానిపల్కు లుపదేశించును. కానీ, విందము. (తండ్రియొద్దఁ గూర్చుండును.)

ధృత— కుమారా! (చేతులతో దగ్గఱకుఁ దీసికొని)

మ. ఇంద్రియదుర్మదంబు మొద లేడఁగఁ ద్రుంచి మనంబు వంచి ని
ష్ఠం ద్రిగుణంబు వాపెడువిచారము సేయుమునీంద్రు లేదయా
సాంద్రుని రూపుఁ జూచుటకుఁ జాలక కుందుదు రట్టివాఁడు వ
చ్చెం ద్రుహిణేంద్రవందితుఁడు చేరువకుం బనిగల్గి దూతయై.

కావున నయ్యనఘుమాటలు నిరాకరింపక ప్రత్యుత్తరము చెప్పుము.

దుర్యో— నేఁడు క్రొత్త లేమున్నవి? వెనుక సంజయుఁడు చెప్పిన మాటలే యాతఁడును జెప్పను. అందుకు నే నంగీకరింపనని యెఱుఁగనివా రెవ్వరు?

ధృత— తండ్రీ! అట్లు కాదు. భీష్మ ద్రోణ కృపాశ్వత్థామ ప్రభృతులగు మనమహారథికు లందఱును సంధి కొడంబడుటయందు కృతనిశ్చయులై యున్నారు. వారైనను,

శా. "ఐదూళ్ళిచ్చినఁజాలు మా" కనిరఁటన్యాయంబుగా నేల దా
యాదద్వేషము? పేటిసంగరము సేయంజాలుదే? నీకుఁ "గ
ర్ణాదుల్ గల్గ భయంబిఁకేల" యనుధైర్యంబుండెఁగాఁబోలు నేఁ
డేదీ! తెల్పుము కవ్వడిం దొడరువా రెవ్వారొ నాముందఱన్.

గాంధా— కుమారా! మీతండ్రిగారిమాటలు వినుము. పెక్కుదేశంబు లుండఁగా నైదూళ్ళు వారికిచ్చినంతనే నీకుఁ గొదవయగునా! పెద్దల మాట లేల నిరాకరించెదవు? చిరకాలమునుండి తఱచుగా నీ కురువంశమున రాజ్యము కనిష్ఠకుటుంబమందే నిల్చుచున్నది. యయాతి సుతులలో జ్యేష్ఠుండగు యదునృపాలుఁడు మదోన్మత్తుఁడగుటంజేసి యతనికిరాజ్యంబు రాక పితృభక్తిరతుండగు పూరునరపతి కయ్యది సంఘటించె. పదఁపడి మీ ముత్తాతలు దేవాపి బాహ్లీక శంతనులు మూగురలో రోగగ్రస్తుండగు కతన జ్యేష్ఠుఁడు ప్రజాసమ్మతుఁడు గామింజేసి కనిష్ఠుండయ్యును శంతనుండె పట్టాభిషిక్తుండయ్యె. పిమ్మట దేవవ్రతుఁడు జ్యేష్ఠుండయ్యు మీతాతయగు విచిత్రవీర్యునకు రాజ్యంబు సంక్రమించుటయు మీతండ్రి సమక్షమ్మునఁ బాండునరపతి రాజ్యం బొనర్చుటయు నీవెఱుఁగనివికావు. కావున లోభం బుడిగి మీరును మీరును బంచి కుడుచుట శ్రేయస్కరంబు. మమ్ముఁ దుట్టతుదకు దిక్కుమాలిన వారిఁగా నొనర్పకుము. పెద్దలమాట విని బ్రతుకుము.

ధృత— పుత్రకా! ఇంకొక విశేషముఁ జెప్పెద నాలకింపుము.

గీ. లోకములు భస్మమగు సర్వలోకనుతుఁడు
ధర్మరా జగ్గలేని; యతండు కుదురు
ధర్మమున; కాడి బొంకఁ డుదారచరితుఁ
డగడువడకుము యుద్ధంబు తగదు కొడుక!

(జనాంతికము) తండ్రీ! మీయమ్మమాట నిజము.

ఉ. వెనుకటినుండి రాజ్య మది పెద్దకుటుంబములోన నుంట యీ
మనకులమందు లేదు కనుమా! మును శంతనుఁ డెట్టివాఁడొ? మ
జ్జనకునిచంద మెట్టిదియొ? సజ్జనమాన్యుఁడు పాండురాజు తా
జనపతియౌట యెట్టిదొ? విశాంపతి ధర్మజుఁడౌట యట్టిదే.

కావున నీ వృద్ధాచారం బతనినే రాజుగా నాకుఁ దోపించుచున్నది. నీవు మాఱుమాటాడక సంధి కొప్పుకొనుము. లేనిచో సర్వమును గోలుపోవుటయు లోనగు ననేక కష్టములకు లోనగుదువు.

గాంధా— అయ్యా! వారు తమభాగంబునకై పెనంగువారు గాని యధర్మ వర్తనులు గారు. ధర్మమే జయించునందురు. అదియునుంగాక పితామహగురు కృపాచార్య ప్రభృతులందఱు న్యాయపక్షపాతులు. న్యాయంబున కొడంబడి పండ్రెండుసంవత్సరంబులు వనవాసంబును నొకయేఁ డజ్ఞాతవాసంబును సలిపి తమతండ్రి పాలికై పోరాడఁ జాలియు బంధునాశ

నంబునకుఁ జంకికదా ? "ఐదూళ్ళిచ్చినఁ జాలు" నని మురారి నంపిరి. అట్టి ధార్మికుల యెదుటఁ ద్రిశూలధారియగు శంకరుండును నిలువనోపఁడు. పద్మాక్షుండు గూడ వారిపట్టై యున్నవాఁడు. కావున నీనూర్గురుతమ్ములం గాచికొని పాండవసహితుండవై జగంబు నిష్కంటకముగ నేలికొనుము.

దుర్యో— తల్లిదండ్రులారా ! మీరు చెప్పవలసినవారు కావునఁ జెప్పిరి, కాని,

గీ. ఐదూళ్ళిచ్చినఁ జాలును
లేదే నని సేఁత నిజము లెండనుచుఁ దా
యాదులు గబురంపిన నే
నీఁ దలఁచుట వారి కోడుటే యగుఁగాదే ?

ఐనను పెద్దలమాటలు నిరాకరింపక యిచ్చితినే యనుకొనుఁడు,

గీ. మొదటనుండియు మేము మేమును బరస్ప
రాపకార మొనర్చుకొన్నట్టివార
మైతి మేగతిఁ గలియు నన్యోన్యమైత్రి
లోనిపగలును బయలిచెల్మలును గాక.

వారు బలవంతులై మమ్ముం జెనకుదు రని కలలోనైనం దలంపకుఁడు.

చ. సమరము చేయరే బలము చాలిన ? నల్వురుఁ జూచుచుండఁ బెం
డ్లము పెఱవారిచేఁ గటకటం బడఁ జూచుచు నూరకుందురే ?
మమతయుఁ గొంకు మాన మవమానము సిగ్గును లేనివారి నె
య్యము తగునయ్య ! భూమిపతు లందఱు నవ్వరఁటయ్య ! చేసినన్.

శా. రాధేయుండును నేను దమ్ములును సంగ్రామంబులో నిల్వ నా
కాధీశుం డరుదెంచుఁగా కెవరుశక్యంబె ! వృథాభ్రాంతి గా
నీ ! ధర్మంబని కానకేగుదురె పండ్రెండేండ్లు తేజోబల
ప్రాధాన్యంబు గలట్టి రాచకొడుకుల్ పౌరవ్యవంశాగ్రణీ ?

అదియునుంగాక,

క. తమ్ముని తనయులకుం బా
లిమ్మనెద వయో ! యమానిలేంద్రాశ్వినులో
తమ్ములు ! పాండునృపాలుఁడొ
తమ్ముఁడు ! వివరింపుమయ్య తండ్రీ ! నీకుఁ.

గాంధా— నాయనా ! నీ కాయప్రస్తుతప్రశంసయేల ! తీఁగఁగదిపిన డొంక

యంతయుఁ గదలును. ధర్మశాస్త్రప్రకారముగ వారలకుం బాలు లేదంటివేని యావచనములు చెప్పి యీసభాసదుల నొప్పింపుము.

జమదగ్ని— (జాబాలితో జనాంతికము) చూచితివా యీగాంధారి చాతుర్యము ! పాండవులం గుండులని యాక్షేపించినఁ దనకుమారుల నెవ్వరేని గోళకులని నిందింతురేమో యని యాప్రస్తావన ముగింపు మనుచున్నది. కానిమ్ము, సభాముఖంబునఁ బతివ్రతల నవమానపఱచుట మనకేల ?

జాబాలి— అగును. తొల్లి యీగాంధారిం బరిగ్రహించినవాడు మృతుండగునని కార్తాంతికులు నిర్ణయింప గాంధారధరణీపతి ముందుగాఁ దనకూఁతు నొక యజపోతమునకుం బెండ్లిచేసెనఁట ! పిదప నాంబికేయునకుం బరిణయము చేసెను. ఎందుఁ జూచినను మహాత్ముల చరిత్రములు విచిత్రములు. అందుఁ గౌరవుల చరిత్రము మిగుల విచిత్రము.

దుర్యో— తల్లీ ! నీవు ధర్మశాస్త్ర మని యెత్తుచున్నావు. అట్లేని రాజ్యము జ్యేష్ఠకుటుంబములోనిదే గాని కనిష్ఠకుటుంబములోనిది గాదు. తండ్రిగారి యవివేకమువలన మొట్టమొదట వారి కెట్లో యర్ధరాజ్యము వచ్చినది; కావున వారిప్పుడు నాపైకి దాడివెడలుచున్నారు. ఇది కేవల మధర్మము. నీవు సెప్పినచొప్పున ధర్మమే జయించునేని నాకే జయమబ్బుఁగాక. (యోజించి) నా కాధర్మశాస్త్ర ప్రశంసయేల ? రణంబున జయం బొండెఁ బరాజయం బొండెఁ గానీ నానిశ్చయంబు వినుము.

గీ. పగఱ గెలిచితి నేని యీజగతి నేలు
కొనెద ననుజన్ములును గొడుకులును గొలువ
శత్రువులు గెల్చిరేనియు సపరివార
మనుభవించెద నాకలోకానుభవము.

ఉ. శౌరి వచించుమాటలకు జంకినమీయుపదేశ మేము వి
న్నారము కామటంచు మది నాన వహింపకుఁ డమ్మరో ! నమ
స్కారము " రాజరా " జనుచు సార్థకభావము దాల్చినట్టి నా
పేరు జగంబున న్నిలుప వేఁడెద నట్టు లనుగ్రహింపుఁడీ.

ధృత— కుమారా ! నీవు యుద్ధమందుఁ గృతనిశ్చయుఁడవై యుంటివి. తోఁకఁ ద్రొక్కిన మహానాగంబులకరణి నీపయి కుఱుకఁదలంచుచున్న పాండవుల బలపరాక్రమంబులు నాకడుపులోఁ జేయివెట్టి కలఁచుచున్నవి.

చ. "భరతకులంబు పేరు నిలుపం దగురా !" యని తల్లి వేఁడ వ్యా
సబుధి మహామనీషి మనసంతతి నిల్పెఁ గదయ్య ! తాత సం

సరణము రోసియుం బరవసంబునఁ బెంచెఁ గదయ్యా ! దాని నే
లరమరమై కుటుంబకలహంబునఁ ద్రుంచెదవయ్యా పుత్రకా ?

గాంధా— తండ్రీ ! వాయునందనుండు జరాసంధ హిడింబ కీచకులం జంపె నని విన్ననాఁటనుండియు నాకడుపు బగ్గుబగ్గున మండుచునే యున్నది. మీసహాధ్యాయు లైదుగురలో నొక్కనిచేతం దక్కిన నల్వురుం జావ గలరని మీగురుండు శపించె ననికూడ వినియుంటిని. అందు భీమసేనుని చేతం బడుటకు నీవొక్కఁడవ మిగిలియుంటివి; కావున సంధి గావించు కొని నీప్రాణంబులు నిలుపుకొని మమ్మీ దుఃఖపారావారముం దాఁటింపుము.

దుర్యో- ! కుడిచికూర్చుండక యేల యిట్లమంగళవాక్యము లాడెదరు ?

గీ. భరతకులమున కేల లోపంబు రెండు
తెగలవా రనిఁ జచ్చు టెందేనిఁ గలదె ?
సంధి చేసినఁ దప్పునే చావు ? గురుని
శాపవచనంబు నిజముగా జరుగునేని.

మ. చన దే నిట్టిఁడ నంచుఁ జెప్పికొన; మీసందేహమున్ దీర్పఁజె
ప్పనుడు ల్సాయివి; ద్రోణునిన్ గృపుని భీష్మున్ ద్రౌణి నెట్టెట్టులో
ననిలో నెంచెదొ నన్ను నంత కధికుం డం చెంచుమీ ! యస్త్రశ
స్త్రనికాయంబులపట్ల బాహుబలధైర్యస్థైర్యశౌర్యంబులన్.

మీ రెంతసేపు చెప్పినను పిచ్చిసంజయుని మాటలు విన్నది మొదలు వారికి దేవతలుగూడ సహాయు లగుదు రని చెప్పుచున్నారు. అది కేవలము పొరపాటు. కామక్రోధాదులకు వశులై గీర్వాణు లెప్పుడును వర్తింపరు. అట్లు వర్తించి రేని వారికి దేవత్వమే నిలుసదు. కావున వారును మనుజులు, మేమును మనుజులము. సర్వవిషయముల మా బలపరాక్రమంబు లెక్కుడు. భవితవ్యము నేను మున్నే నిర్ణయించియుంటే, దాని నాలించి స్వస్థతఁ గైకొనుఁడు.

చ. అనిఁ దెగటార్తుఁ బాండవుల నందఱినిన్ ద్రుపదాత్మజాతుతో
వనరుహనేత్రుతో నృపతివర్గముతో నచిరంబ, స్వాస్థ్యమున్
గని పొనరింతు యజ్ఞములు, కాంచనమున్ మణు లగ్రహారముల్
ఘనులకు నిత్తు విప్రుల కఖండవదాన్యులు నన్ను మెచ్చఁగన్.

ధృత— (తనలో) అమంగళము శాంతించుఁగాక ! వాగ్దేవత భావికాలానుసారిణియై ప్రసరించును గాఁబోలు !

కర్ణ తల్లీ! గాంధారరాజనందని!

ఉ. తాపసికిం జనించినకతంబునఁ బోరికి వెన్కఁదీయునా
లాపము లాడుఁగాక వికలంబుగఁ బుత్రులతోడ నేఁడు; నీ
వే పెడలం గుమారకుల కిట్టిపురుక్తులు చెప్పఁబూని తె
ట్లో పరువైన క్షత్రియకుటుంబములోపలిదాన వక్కటా!

ధృత— (తనలో) ఈసూతనందనుని మైత్రియే నాకులంబున కింత చేడ్పాటు తెచ్చినది. (కోపముతోఁ బ్రకాశము) ఓరీ! కురుకులకాంతారదవానలాభిధేయా! రాధేయ! ఇంకేమి చేయించెదవురా!

సీ. కలసి నీరక్షీరములభాతిఁ దనరారఁ
దగుబిడ్డలకుఁ బగ ద్గాపి తీవు
ధర్మరాజును మాయదారివై రావించి
వంచించి జూద మాడించి తీవు
ద్రుపదమహారాజు దుహితను రచ్చ కీ
డ్పించి పుట్టంబు లొల్పించి తీవు
కూడుఁగుడ్డకు దూరగులఁ జేసి పాండవ
వీరుల నడవి కన్పించి తీవు

గీ. సంధి పొసఁగింప వచ్చిన శౌరితోడ
నడ్డదిడ్డంబు లాడించి యంపుచుంటి
విచ్చవచ్చినరీతిఁ జేయింపు మార!
భరతవంశంబు బ్రతుకు నీపాలఁ బడిసె.

గాంధా— మహారాజా! మనసంతానమును మందలింపఁ జాలక యొరుల దూషించినం బ్రయోజనం బేమి? మీరన్నమాట మాత్ర మసత్యముకాదు. పాండవమధ్యమునిం గెలువఁ జాలుదునను కర్ణుప్రగల్భములే సుయోధనుఁ డిట్లు తెగుటకుం గారణములు.

వికర్ణ— కురుకులేశ్వర! నీకుమారునితో మైత్రిగావించిన రాధేయునకుం దగిన బిరుద మిప్పించితివి.

గీ. దొరవు నీకన్నకొడుకులతో సమముగఁ
బెంచితివి మాకుటుంబముఁ బేర్మి మీఱ
నీదుమాటల కెదురాడరాదు గాని
యీ వెఱుంగనిపని చేసి రెవరు చెపుమ.

పాండవులయం దంతగా నీకు నిక్కమగు వాత్సల్య మున్నయెడల,

మ. పరులం దూఱఁగ నేల! వారి నిటు పిల్వం బంచి యీవేళ యు
ర్వర సర్వంబును ధారవోయఁగ స్వతంత్రత్వమ్మ లేకుంటివో!
ధరణీనాయక! యేల యిట్లతిథిచేతం బాముఁ జంపించు నే
ర్పరిచందంబున మెచ్చులాడెదవు? మీవారంద ఱాలింపఁగన్.
అదియునుం గాక,

చ. ఇలఁగల సర్వరాజుల జయించిన వీరులు పాండురాజపు
త్రులసిరి చూచి యోర్వమి విరోధము పూని సుయోధనుండు వా
రలయెడఁ జేసినట్టియపరాధము లన్నియు సూతపుత్రు నొ
డలఁ బడవేయు టేనృపతిధర్మము? కౌరవవంశభూషణా!

దుర్యో— కుమారా! వికర్ణ! ముదిమిచే మదితప్పిన యీమహారాజు మాటల కభిమానపడెదవేల? (తండ్రితో) అయ్యా! నా బహిఃప్రాణంబగు కర్ణు ననుట యొకటియు నన్ననుట యొకటియునా? ఇంకొకసారి యిట్టి కర్ణశూలాయమానంబులగు దుర్భాషలాడితివేని,

గీ. అంబికావంశశాఖ కీవగు దొకండు
కట్టకడదాఁక గాంధారికడుపు మండు
నవనియంతయుఁ గైవసంబగును బాండు
రాజసుతులకు, నీమనోరథము నిండు.

కర్ణ— (చెవులుమూసికొని) పాపము శాంతించునుగాక! మిత్రమా! ఈమహారాజు వాక్యములు విని నామనసు విఱుగుననియా! యిట్టియశ్లీలవాక్యంబు లాడుకొనుచున్నావు? చాలుఁజాలు, ఇన్నాళ్ళు మైత్రి గావించితివి గాని కర్ణుని మనోనిశ్చయంబు గుర్తింపలేకపోయితివి.

ఉ. అర్ణవసప్తకం బొకటియై ధర క్రుంగిన మిన్ను వంగినన్
స్వర్ణగిరీంద్రముం బగులువాఱిన లోకము తెల్లవాఱినం
బూర్ణదయాసహాయుఁడయి పోరికి వచ్చి పురారి యగ్గినం
గర్ణునిమేనఁ బ్రాణములు గల్గినఁ బార్థులచావు దప్పునే.

ధృత— (నిట్టూర్పుపుచ్చి జనాంతికముగా) దేవీ! గాంధారరాజపుత్రీ!

గీ. కుంతికొడుకులు తుద కింత కూడొసంగ
బ్రతుకు మని వ్రాసెఁ గాఁబోలు బ్రహ్మ నొసట
బ్రతుకనీయఁడు వీఁ డొక్కసుతుని నేని
ముసలివాండ్రకుఁ గేలూఁత యొసఁగుకొఱకు.

(గాంధారితొడపై మూర్ఛిల్లును)

గాంధా— (పైఁటకొంగుతో విసరుచు) తండ్రీ! దుర్యోధన! కుమార! దుశ్శాసన! కుడువనా? ముడువనా? కాలము తీఱిన ముదుసలులకు మా కేమి కావలయునురా? ఏమి చెప్పినను మీ బాగుకొఱకే గదా! మీ శుభోచ్ఛయముఁ జూచుచు నీఁకఁ గొన్ని దినంబులు బ్రతుకఁ దలఁచిన తల్లిదండ్రుల నేఁడే గతాసులం జేయుచున్నారా! (ఏడ్చుచు మూర్ఛిల్లును)

విదు— సుయోధనా! నీవు విన వని యెఱిఁగియు నుపదేశపూర్వకంబుగాఁగ నామనస్తాపంబుఁ గూడఁ గొంత యుపశమింపఁ జేసికొనియెదను.

ఉ. తల్లికిఁ దండ్రికిం బ్రజకుఁ దప్పని తోఁచినచేఁత సేయ నీ
యుల్లము తల్లడిల్లదు వయోభవమైన దురాగ్రహంబునం
గల్లరిమూఁకమాట చెవిఁ గట్టుకొనం దగునయ్య? తమ్ములుం
బిల్లలుఁ జల్లఁగాఁ దగువివేకము జెప్పిన నేర వక్కటా!

పెద్దలమాట వినుట యట్లుంచి సభాముఖంబునం గార్యాకార్యవిచారంబు సేయునపుడు పెక్కుర కనుమతం బగుకార్యంబు చేయందగునని తొల్లి శుక్రాచార్యుఁడు చెప్పిన తెఱంగైనఁ బాటింపుము.

చ. భవదనువర్గమే కద! సభాసదు లందఱు శౌరి దక్కఁ బాం
డవుల తెఱంగు నీతెఱఁగు నల్వురకు న్విశదంబ కాన నిం
దెవరి తెఱంగు మంచి దని యెక్కువమంది వచింతు రట్ల కా
దవు నని యొప్పి యిచ్చటి సదస్యులు చెప్పినరీతిఁ జేయుమా.

దానికి నంగీకరింతువేని సంఘుమరణంబు తప్పుటయు, నీమనోరథంబు సఫలంబగుటయుఁ గూడఁ దటస్థించు; నింకొక విధానంబు చెప్పెద. తొల్లింటివారు పరస్పరకలహంబులు సంప్రాప్తించునెడ నిరుతెగలనుండి యిరువురు బలిష్ఠులకుఁ దులారణంబు సమకూర్చి వారి జయాపజయంబులచే రెండువీళ్ళవారును జయాపజయంబులు నిర్ణయించు కొనుటయుఁ గలదు. కావున,

ఉ. వాసవితోడఁ బోరఁగలవాఁ డని కర్ణునియందు నీవు పే
రాస గలట్టివాఁడవుగదా! యిపు డిర్వురఁ బోరఁ జేసి యం
దోసరినట్టివాని దెగ యోడినటు ల్మన మెంచుకొంటిమే
నీ సమరంబు మాను, జగమెల్లరకుం గడుసంతసం బగున్.

భీష్మ— దుర్యోధనా! విననేర్చితివేని యీ విదురుని పలుకులు లెస్సపలుకులు; అందుం దులారణంబుమాట మిగులం గొనియాడఁదగినది. ఏమంటివేని,

ఉ. కవ్వడితోడి పోరితము కర్ణున కిష్టము వానిచేత నా
కవ్వడి నొవ్వఁజేసి రణకార్యము దీర్చుట నీమనోరథం

బిప్పురుసన్ ఘటించుఁగద ! యిర్వురకోరుకు; లెల్లరాజులుం
జివ్వకుఁ బాసి సంతసముచే మని చూచెద రాలుబిడ్డలన్.

అది యట్లుండె నింకొక్కటి వినుము.

క. ఎన్నఁడు జన్మించితిమో
యెన్నఁడు పెరఁగితిమొ యుద్ధ మేటికి ? మా కో
యన్నా ! ముదుసళ్ళము భగ
వన్నామముఁ దలఁచుకొనుచు బ్రదికెద ముర్విన్.

దుర్యో— శాంతనవా ! ముదుసలివికాకపోయినను నీవు మాకు సహాయుఁడ వగుదు వనుకొంటిమా యేమి ? తులారణంబునం బార్థమధ్యము నుక్కడఁగించిన మాకుం బ్రయోజనం బేమి ? నేఁడు రాజ్య మంతయుఁ గైవసంబుగా కుంటిమా ?

చ. చచ్చినక్రీడి నచ్చినను జావనినల్వురు "మాకు నాలు గూ
ళ్ళిచ్చినఁ జాలు" నం చడుగరే ? యపు డందఱు మీరు సెప్పరే ?
యిచ్చక మేల యాడెదవు డెల్లరుఁ జూడఁగ జూదమందుఁ గో
ల్పచ్చిన భాగము న్మరల లోఁగొనఁ జూడరె నేఁడు వీరులై?

అదియుంగాక,

గీ. అయిదుగురు మాకు శత్రువు లంతె కాక
క్రీడి యొక్కఁడొనర్చిన కీడు గలదె ?
బ్రదికియుండిన నేగురు బ్రదుకవలయుఁ
జచ్చిరేనియు నేవురుఁ జావవలయు.

ద్రోణా— (చిఱునవ్వునవ్వి) వెఱ్ఱివాఁడా ! సుయోధనా ! తులారణంబున నంగరాజప్పుడే విప్వచ్చు నోడించె ననియే యనుకొనుచున్నావా ! ఆతని బలపరాక్రమములు నీవే మెఱుంగుదువు?

ఉ. పాశుపతంబుఁ జేకొనియె భర్గుని యుద్ధములో నెదిర్చి నా
కేశునిలోక మేగి యతఁ డెక్కె నగగ్రియ యొక్కె సర్వభూ
మీశుల గెల్చి చేసెఁ బృథివీశ్వరు నగ్రజు నశ్వమేధ; నీ
కాశయ కాని యాలమున నర్జును దాఁకునె కర్ణుఁ డద్దిరా !

క. విరటుని పశువులఁ బట్టిన
తరుణమ్మున నాతఁ డొకఁడు తాఁకిన మన యె
ల్లరగతి యే మయ్యెనో ! యే
తెరవున నడచితిమొ మఱచితే కురునాథా !

దుర్యో— ఆచార్యవర్య! సర్వజ్ఞులు మీరసయితే మఱ్ఱె సెలవిచ్చిన నేనేనియు విన్నవింతును.

ఉ. పాండవపక్షపాతము భవన్మతము న్మరలించెఁగాక యా
ఖండలనందనుండు తమకంటెఁ బరాక్రమశాలియే! యద
ట్లుండఁగ నెన్నఁడో యయిన యుద్ధముమాటఁ దలంతురయ్య? కా
నిండు మహాత్మ! మీకుఁ గృప యాగతివచ్చిన నేమి చేయుదున్?

భవాదృశులు పాండవులతో సంధిచేయు మనుటకంటె సర్వంబు వారి కొసంగి మమ్మె యరణ్యంబునకు లేచి పొండనుట ధర్మము. అనుల్లంఘనీయం బగు మీయానతి చొప్పున సంధియే కావించితినేని,

గీ. ఇరుగురు స్వతంత్రు లొకదేశ మేలఁగలరె?
యతుకునే రెండు ముదిరిన యవనిజమ్ము?
లిముడునే రెండుకత్తు లెందేని నొక్క
యొఱను? నిమిడింపఁ జూచిన గురువరేణ్య!

ద్రోణా— గాంధారేయప్రథమ! ఏము పాండవులయెడఁ గాని మీయెడల గాని భిన్నాభిప్రాయులము కాము. భీమార్జునుల బలంబు లెఱింగియున్న వార మగుటచే నిట్లు చెప్పుచుంటిమి.

క. ముదిసితిమి భోగముల, సం
పదలుంగుడిచితిమి మేము బ్రదుకఁదలఁచి యీ
కదనము వలదంచుం జె
ప్పెదమే? వీఱిఁడివి గాక వీరమ్మన్యా!

దుర్యో— (సానునయముగా నంజలి బంధించి) ; ధనుర్నిగమపారావారపారీణ! కుంభసంభవ!

శా. తల్లిం దండ్రియుఁ దాత మీరు మొదలా ప్తశ్రేణియుం జెప్ప ట
స్మల్లాభంబునకే, యెటుల్ రిపులతో సంధింతు సిగ్గేది; చా
వెల్లం బ్రాణుల కున్నదే యెటులనో యేవేళనో యెందొ! భీ
తిల్లం బాడియె? మానహానియును గాదే! చావు విప్రోత్తమా!

క. చచ్చెదమో! రిపువీరుల
వ్రచ్చెదమో! యెవ్వఁ డెఱుఁగు? రాఁదలఁచినచో
వచ్చి యని నేసి ధైర్యం
బెచ్చించుచుఁ బగఱ నొంచు మిదె ప్రార్థింతున్.

(నమస్కరింపఁబోవును.)

కర్ణు— (దుర్యోధనుని లాగుచు) మిత్రమా! మిత్రుండ వగు నాకుఁ గూడ లజ్జాకరంబగు పని చేయుచున్నావు. బ్రాహ్మణుఁడని కాని గురువని కాని నమస్కరింతువు గాక!

మ. "అనికిం దోడ్పడు" మంచుఁ బాలునొకనిం బ్రార్థింపఁగావచ్చునే?
కనకక్ష్మాధరధీర! రానిమ్ము సంగ్రామాంగణంబందు; నీ
యనుఁగుం గర్ణుఁడు చచ్చెనే! యిటుల దైన్యంబంద నీకేల? యా
వెనుకన్ దైన్యము చెందెదో! రిపులతోఁ బెంపేది సంధింతువో?

అశ్వ— (అహంకారముతో) ఓరీ సూతచండాల! అట్లయిన నిదిగో నేఁడే చచ్చితివిరా! (మీఁది కురుకఁబోవును)

కృష్ణు— (అడ్డుపడి) ద్రోణాచార్యపుత్ర! త్రిదివసేనానీసమధామ! అశ్వత్థామ! కోపింపకుము. రణచక్ర మంతయుఁ దనచేతిమీఁదనే త్రిప్పఁ గలయునను కర్ణుని మనోరథమే చెల్లింపుము.

శా. సేవాధర్మము సూతధర్మమును రాశీభూతమై యొప్ప వా
చావాత్సల్యముఁ జూపెఁ గర్ణుఁ డిటు మాత్సర్యంబు మీకేల? రా
జేవేళ న్నిమ్ముఁ గోరునో! యనికి నాఁడే పాండు పోరాడ, లే
దా, వర్జింపుఁడు కర్ణు చావువలనో యత్యంతమో యుద్ధమున్.

కర్ణు- కృష్ణా! నివారింపకుము. రాని మ్మేమిచేయఁగలఁడో చూతను.

అశ్వ— (కోపముతో) ఏమిచేయుదునా! యీపిడికిలితో నీతల వేయిప్రక్కలు గావించెదను. (కృష్ణుం దప్పించుకొనుచుఁ బైకురుకఁబోవును)

దుర్యో— (వచ్చి పట్టుకొని) తమ్ముఁడా! యేల యింత తొందర?

శా. కోపజ్వాల రగుల్పఁ బోకుము దయాకూపార! మాకెల్ల వీ
తాపాయం బగుతోఁచఁ బోవుము రణవ్యాసంగివై కార్ముక
వ్యాపారంబు విరోధివర్గముల పైపైఁ జూపి చెండాడు మ
య్యా! పోరాటము పాడియే మనకు నన్యాయంబి టన్యోన్యమున్!

— (కన్నులింతలుచేసికొని) ఓయీ మూఢదుర్యోధన! ఇంకను సిగ్గు లేక యనునయింప వచ్చితివా? చాలుఁ జాలు.

మ. అనికిం దోడగుమంచుఁ గోరఁ దగఁడే యాచార్యుఁ; డీ సూతనం
దనుఁడా నీకు నియామకుండు? ధరణీనాథుండ వాచార్యపా
దనమస్కారము గూడఁ గూడ దనుచుం దా నీకు బోధించి మా
న్పిన మానం దగువాఁడవే ఖలమతీ! విశ్వాసశూన్యాకృతీ!

ద్రోణా— కుమారా! ఏల రాజదూషణము? ఖలుఁడైనను రాజుం బరిత్యజిం
చుట తగవు గాని దూషించుట తగవు కాదు.

కృష్ణు — మహాత్మా! అట్లు పరిత్యజించుటమాత్రము ధర్మమా?

కర్ణు— ఇట్టివారు పరిత్యజించిన నేమి పరిగ్రహించిన నేమి? (దుర్యోధను
నితో) హస్తిపుర సార్వభౌమ!

శా. చాలుంజాలును జేరు చూడ ధనురాచార్యాంక, మాలంబులో
నేలోపంబు ఘటించినం జెడుఁ గదా! యీపెద్ద పేరంచు ని
ట్లాలోచించె నెపంబు సంగరపరిత్యాగంబు గావింప; జం
కేలా! పోరికి వీరు తోడుపడువారే యంచు నాశించితే?

అశ్వ— దురహంకార పరిభవిష్యమాణ కురుకుల రూపధేయ! రాధేయ!

శా. మీఱంబోకుము పొల్లుమాట; లనికి న్మీరాజు రండంచు మ
మ్మారాధించిననాఁడె వచ్చెదములేరా!
(ద్రోణాచార్య కృపాచార్యులం జూచి) తండ్రీ! రావయ్య, మా
మా! రా పోదము, పోరికై యెవరి నీక్ష్మాపాలుఁ డాసించెనో
వారే గెల్తురు వారి వారల బలావష్టంభము ల్బ్రోచెడన్.

(దిగ్గన లేచి పోఁబోవును)

కృష్ణు — కుంభపాత్ర! కృపాచార్యభాగినేయ! కించిత్కాల మోపిక చేయుము.
అందఱము పోవచ్చును. (దుర్యోధనునితో) బావా! నీకొల్వుకూటము
క్రమముగా రణకూట మగుచున్నది. పదుగు రుండఁగనే నాచెప్పఁ
బోవు పల్కులు గూడ నాలింపుము.

ఉ. చెల్లియొ చెల్లకో తమకుఁ జేసిన యెగ్గులు సైఁచి రందఱుం
దొల్లి గతించె, నేఁడు నను దూతగఁ బంపిరి సంధి సేయ, నీ
పిల్లలు పాపలుం బ్రజలు పెంపు వహింపఁగఁ బొందు సేసెదో?
యెల్లి రణంబుఁగూర్చెదవొ? యేర్పడఁ జెప్పుము కౌరవేశ్వరా!

చ. అలుగుటయే యెఱుంగని మహామహితాత్ముఁ డజాతశత్రుఁడే
యలిగిననాఁడు సాగరము లన్నియు నేకము గాకపోవు, క
ర్ణులు పదివేవురైన నని నొత్తురు చత్తురు రాజరాజ! నా
పలుకులు విశ్వసింపుము విపన్నుల లోకులఁ గావు మెల్లరన్.

శా. జెండాపైఁ గపిరాజు ముందు సితవాజిశ్రేణియుం గూర్చి నే
దండంబుంగొని తోలుస్యందనము మీఁద న్నారి సారించుచుం
గాండీవమ్ము ధరించి ఫల్గునుఁడు మూఁకం జెండుచున్నప్డు డొ
క్కండు న్నీ మొఱ నాలకింపఁడు కురుక్ష్మానాథ సంధింపఁగన్.

శా. సంతోషంబున సంధిసేయుదురె ? వస్త్రంబూడ్చుచో ద్రౌపదీ
కాంతం జూచిననాఁడు చేసిన ప్రతిజ్ఞల్ దీర్ప భీముండు నీ
పొంత న్నీసహజన్ము లొమ్ముల రుధిరమ్ముల్ ద్రావునాఁడైన, ని
శ్చింతం దద్గదయుం ద్వదూరుయుగముల్ ఛేదించునాఁడేనియున్.

దుర్యో— (విననియట్లు నటించుచుఁ దనలో) నోటికివచ్చినట్లెల్లఁ బ్రేలుచున్నాఁడు. ముందు వీని మదమడఁచినం గాని యీపాండవుల మదమడఁగదు. ఇప్పుడే వీనికిం దగిన ప్రాయశ్చిత్తమొనర్చెదఁగాక.

భీష్మ— కుమారా ! జగంబు లన్నిటికిని విశేషంబుగ మనకును జుట్టంబగు నీయాదవ పట్టభద్రుని మాటలయిన మన్నింపుము.

క. విని చెడితివి మున్న క
ర్ణుని పలుకులు బంధుజనులు నూఱుగు రున్నన్
వినక చెడుచుంటి రీవె
న్నని పలుకులు నేఁడు నీవు నూర్గురు తమ్ముల్.

దుర్యో— (సాభ్యసూయముగా) తాతా ! నీకందఱకుఁ గృష్ణునిపై నింత చూపేల ?

ఉ. బంధువులైనవారుఁ దిన వచ్చినవారును "బొందు సేయుఁడీ !
సంధి యొనర్పుఁడీ !" యనుచు జంకి పచింపుచు నుండఁగా దయా
బంధురుఁడై మదీయ మగు పక్షికిం దలచూపెఁ గాన నా
బంధువు కృష్ణుఁడే యతని పాటియె తక్కిన వేల్పులేనియున్.

క. నాతండ్రి పేరుగా దా
నీతనయుం డింతదనుకఁ జేసెఁ బ్రభుత్వం
బీతఁడె నా పేరుగ నీ
సూతతనూజాతుఁ డేలుఁ జూడి రాజ్యంబున్.

కృపా— కురునాథా ! నీ రాజ్యమ్మును నీవు సూతతనూజాతునిచే నేలించుకొన్నను మఱియొకనిచే నేలించుకొన్నను సమ్మతమే కాని, నీ వింత రాజవైనను దినవచ్చినవారని యింత యెగ్గులుగా మాటలాడకుము. నీసొమ్ము తినియుండుటచేతఁగదా మాయంతివారి కిట్టి పోటుమాటలు సహించినవి. కానీ యింకెన్నినాళ్ళులే !

చ. కదనము వచ్చె దాఁపునకుఁ గాలము దీఱిననాఁ డికెల్ల; నీ
మదిగలకోర్కి తీర్చుటకు మా రురఁ దార్కొను క్రూర కీగతిం
బ్రదుకుచు నిష్ఠురోక్తులకుఁ బాలగువారమె ? రాజపుత్ర ! నీ
చదివిన విద్యకుం దగినచందము గంటిమి వేయునేటికిన్.

యుద్ధసన్నద్ధుండవై పదుగురు బలవంతుల సహాయముఁ గోరవలసిన దానికి బదులుగా నీవనవలసిన మాటలేనా యివి! బుద్ధి కర్మానుసారిణి యగుచున్న నిన్ననవేల?

ఉ. చక్కని రాజవంశమున జన్మము నొందినవాఁడ వయ్యయో!
యెక్కడనుండి వచ్చె జగతీశ్వర! సూతునికొల్వు నీకు? నీ
యక్కఱ యేమి యందుఁ జెడనాడుదువే? కులవృద్ధు భీష్ము; మా
దిక్కని వేఁడ కిట్లు చెడఁ దీసెద ద్రోణుని ద్రోణపుత్రకున్?

సార— కురుకుమార! యీ కృపాచార్యుల మాటలు నిరాకరింపవలసినవి కావు. నీతండ్రి యంధుఁడగుటచే దాసీతనయుఁడైనను సర్వవిధముల లోకోత్తరుండైన విదురుఁడు రాజ్యమ్ము శాసించె, నిఁక సన్యుఁ డిప్పు డేల యేల వలసివచ్చును? వచ్చెఁబో;

క. ఉన్నారు తమ్ములాపై
నున్నారు మహానుభావు లుజ్జ్వలతేజుల్
మిన్నంటువారు పాండవు
లెన్నటికిని గర్ణుఁ డేలఁ డిభపుర మధిపా!

బహుశాపదగ్ధుండగు నీకర్ణుని చెలిమికిం బ్రయోజనంబు భీష్మాదులతోడి విరోధంబ కాని యొండు గాదు. వీనికిం గలిగిన శాపములు వినుము.

గీ. మాఱువేసంబుతోడ బ్రాహ్మణుఁడ ననుచుఁ
జేరి యాజమదగ్ని కుమారునొద్దఁ
జదివినట్టి దివ్యాస్త్రము ల్సమరమున స్ఫు
రింపఁ బోవని తుదను శపింపఁబడియె.

అదియునుంగాక,

ఉ. చిన్నతనంబునం బ్రిథమశిక్షగఁ దూపులవేఁత నేర్చుచుం
జన్నపుటావుపై విడిచి చంపిన దాని మహీసురుండు ని
ర్భిన్నమనస్కుఁడై యిటు శపించె "రణం బొనరించువేళ నీ
యున్నరథంబు క్రుంగఁబడు నోరి దురాత్మ! ధరిత్రిలోపలన్."

సహజంబులగు కవచకుండలంబు లున్నఁ దనకుమారున కజేయుఁ డని కదా! త్రిలోకపతి యగు మా దేవేంద్రుఁడు కూడఁ బరప్రార్థనాదైన్యం బంగీకరించి వీనిం గోరలూడ్చిన పన్నగంబుఁ జేసినను వీనిబలం బెఱుంగకున్నావు. ఇది యిట్లుండ నింకొకటి వినుము.

ఉ. అందఱు నాకుఁ బేరు కలహప్రియుఁ డందురు నిశ్చయంబుగా
సందడి యన్న నాకుఁ గడుసంబర మెవ్వరికేని మీఁదికిం
గ్రిందికిఁ బెట్టి పోరు పొసఁగింపన చూచెద నట్టివాఁడ నీ
కుం దగదంటి నాపలుకుఁ గొంచెము నీమది విశ్వసింపుమా.

భీష్మ— (తనలో) అతఁ డంధుఁడు గాని యితఁడు దుర్మదాంధుఁడు. ఇరువు రలో నతఁడే మెఱుఁగు. (ప్రకాశము)

మ. అరయ న్నేరవు సుంత; నాయదియ రాజ్యంబెల్ల; నే నొల్లమిన్
ధరకున్ బాండుఁడు నీదుతండ్రియును భర్తల్ సుమ్ము నే నుండ ను
ర్వరకున్ మీరెవ? రేరు పాండవులు? పోరం గారణం బేమి? యి
ర్వురు నాసమ్మతికల్మి నేలుకొను టొప్పున్ మెప్పు వాటిల్లఁగన్.

ధృత— పితామహా! నీవేల యుపేక్షించెదవు?

తే. గీ. చిత్రకారుని పగిది విచిత్రవీర్య
నందనుని నన్ను రాజ్యమ్మునందు నిల్పి
తీవు మును; పిప్డు పొమ్మన్న నేగువార
మంతియే కాని నిన్నెవఁ డడ్డఁగలఁడు.

క. ఈవు పితామహుఁడవు తా
నేవిధిని బితామహుండు సృష్టించి తగన్
బై వృద్ధి చేసి లయమున్
గావించునొ యట్లు మమ్ముఁ గడ కనుపఁదగున్.

ద్రోణా— సుయోధనా! యిది వినుము.

శా. గాంగేయుం డెది చెప్పె నయ్యది తగన్ గైకోలు నేమంబు గూ
ర్చుం; గార్పణ్యము గాని వేఱొకట నీకుం గాని నాకుండి యీ
సంగాంతమ్మున కియ్యకొ మ్మనఁ జుమీ! సర్వమ్ము భీష్ముండె నా
కుం గూర్చెన్ మఱి జీవనమ్మునకు నేఁ గోర న్నినున్ బార్థులన్.

క. ఇరుతెగయు నాకు శిష్యులె
యిరుతెగకున్ గురుఁడ నేన యిం దెందును నా
కెరు సింత లేని దైనను
నరుఁ డశ్వత్థామవలెఁ గనంబడుఁ జుమ్మీ.

క. ఏ ననియు భీష్ముఁ డని వే
ఱే నీ వనుకోకు మాతఁ డెం దే నందే

భూనాథ! ధర్మ మెందేఁ
దా నిలుచునో జయము నందె తప్పక నిలుచున్.

జమ— సుయోధనా! వృథా దురహంకారంబునం జెడకుము. యయాతియు గరుత్మంతుఁడును మున్నగు తొల్లింటి పెద్దలు సెడుట కిదియే ప్రథమ కారణము.

క. కులవృద్ధగు గాంగేయునిఁ
గులగురువగు ద్రోణు నతని కొడుకుం గృపునిం
దలిదండ్రులఁ బరికింపక
బెలుచు లనఁగ నీకు నీవు పెద్దవె చెపుమా?

ఉ. మక్కువతోడ నిన్ను బతిమాలుచు నున్నకొలంది కర్ణుఁడే
దిక్కని వీరిపల్కులు మదిం జొఱనీవు దురాత్మ తంత్రతన్
వెక్కలి వింతయేమిటికి! భీష్ముఁడు పెట్టిన భిక్షగాదె నీ
కెక్కడి రాజ్య? మయ్యనఘుఁడే ధరయేలఁగ సమ్మతించినన్.

(భీష్మునిదిక్కు మొగంబై) భాగీరథీనందనా! ఈ భూమియంతయు నీదిగాని యీ చెడుగులది కాదు.

ఉ. రోసితి వెల్ల నీవని యెఱుంగుదు మైనను సుంతయేని వి
శ్వాసములేని మోఱకులపైఁ గరుణారస మేల? యేల వి
శ్వాసము నీకు? నీమనసు వచ్చినవారి కొసంగుమయ్య! నీ
శాసన మాను గా దనఁగఁ జాలినవాఁ డెవఁ డుర్విలోపలన్.

కర్ణు— (నవ్వుచు) జమదగ్నిమునిచంద్రమా! తపోనిష్ఠాగరిష్ఠులగు శుద్ధశ్రోత్రియుల కీ రాజకార్య ప్రసంగ మేల? అంబాంబికాంబాలికలను ముగ్గురు రాచకన్నియలం దెచ్చి యం దిరువుర విచిత్రవీర్యునకుం బెండ్లిచేసి యంబ నుభయభ్రష్టురాలిం జేసిన నపుంసకునకు రాజ్య మెక్కడిది? ఏదీ! మనసు వచ్చినవారి కిప్పింపుము.

ఉ. వచ్చినవాదు వచ్చె బలవంతముగా ననిఁ బంచపాండవుల్
చచ్చినదాఁకఁ గర్ణుని ప్రచారము పోదిపు డెవ్వ రేమి వా
క్రుచ్చిన రాజరాజు గయికోఁడు నిజం బెవ రెంతమాట రా
నిచ్చినఁ గొంగు పట్టితి మునీశ్వరులార! బహూక్తు లేటికిన్.

జమ— ఓరీ బాలిశా! శుద్ధశ్రోత్రియులమా? ఇపుడు మాపరశురాముఁ డిక్కడ నున్న మాశుద్ధశ్రోత్రియత్వము కనఁబడునురా!

భీష్మ— స్వామీ! సైరింపుఁడు. మీకుమారుఁ డిటులేఁ డన నేల? యీ శిష్య

పరమాణు వెవరు? అయినను నికృష్టులతోఁ బ్రసంగించుట తగదనియే కదా! యేను మిన్నకుంటిని.

కాబా— రథకారకులీన! ఎవ రెంతమాట రానిచ్చినఁ గొంగు పట్టితివిగా! ఇదిగో రానిచ్చుచున్నాను.

ఉ. ఒక్కనిఁ జంపు నంచుఁ బురుహూతుఁ డొసంగిన శక్తి ఫల్గునుం
డొక్కఁడుఁదక్కఁ దక్కఁగలయోధుల నొక్కనిఁ జంపుఁగా కతం
డెక్కటి ఖాండవంబు దహియించుచు నున్నపు డొక్కనాగు నీ
దిక్కున డాఁగెనే! యది యదృష్టముచే గుఱి తప్పుఁగావుతన్!

కృష్ణ— (తనలో) అకటా! ఈ ముసలిజడదారి శాపవచనములచే విజయ విజయ సాధకంబులైన నాసాధనంబులు రెండును వ్యర్థములగుం గాఁబోలును! (ఆలోచించి) ఒరులపైఁ బక్షపాతమునఁ గినిసి పలికినవి ఋషివాక్యము లైనను బాటితప్పక మానవు. (ప్రకాశముగా నిర్లక్ష్యముగా దుర్యోధనునితో) మిత్రమా! యీఋషి యిట్లు పలికె నని వెఱచుచుంటివా యేమి! పిన్నటనాఁటనుండియు నిట్టితి ట్లనేకములు పడితిని. అవి యన్నియు నిజములైనచో నే నిదివఱకే లేకుందును.

దుర్యో— (వినయముతో) మునీంద్రులార! మీకు మే మేమి యపకార మొన రించితిమి?

ఉ. బాలిశవృత్తి మీ జపతపంబులు పాడొనరింపలేదు మీ
జోలియుఁగాని మీఋషుల జోలియుఁగాని తలంపలేదు మీ
కేల దురాగ్రహంబు? నృపులెల్లరకున్ భువి ధర్మమైన మా
యాలములోన మిమ్ముఁదగవాడఁగ రండని పిల్చినారమే!

దుశ్శా— (జనాంతికము) సహోదరా! యీఋషులందఱు నూరకదురాగ్రహం బున శపింప మొదలిడినారు. భీష్మాదులందఱుఁ బాండవపక్షపాతమున ధర్మాధర్మములు తలంపక మాటలాడుచున్నారు. వీరందఱును దమమాట విననిచో నిన్నుం గృష్ణున కొప్పగించ వలెనని తలఁచుచున్నట్లు నాకు నూహింపనయ్యెడి.

ఉ. ఒప్పరికింప కిప్పగిది నొప్పులొ తప్పులొ వక్క వీరు నీ
యొప్పమిఁ జేయఁగా దలఁచి యుండిరి; కావున నీవు కొల్వులోఁ
దప్పినఁ దప్ప కీడ్వడుట తప్పదు నాపలు కాలకింపుమా!
యిప్పుడ లేచిపోదము మహీపతి మూర్ఛ తొలంగకుండఁగన్.

దుర్యో— (తనలో) బళిరా! తమ్ముఁడ! సమయానుకూలమగు నుపదేశము నొనర్చితివి. (కర్ణదుశ్శాసనామలతో నిష్క్రమించును.)

ధృత— (మూర్ఛదేఱి యాత్రముతో) ఓరీ దురాత్మ ! నే నే మనుకొంటినో యంతపనియుఁ జేసితివిరా ! (గజగజవడంకుచున్నాఁడు)

విదు— మహారాజ ! ఏలభయపడుచున్నావు ? మ ఱేమియు నత్యాహితము రాలేదు. మన దుర్యోధనుఁడు సభాసదులు వచించు మాటలు వినఁజాలక కొలువులోనుండి లేచిపోయెను.

ధృత— అంతియకద ! నిజముగాఁ జెప్పుము. దుర్యోధన దుశ్శాసనకర్ణ శకునులు నల్వురుం గలసి పరాత్పరుండగు శ్రీకృష్ణుని మహత్త్వ మెఱుంగక యతని బంధింపఁ దలంచినట్లును నతండు తనవిశ్వరూపముఁ జూపించినట్లు నొక స్వప్నముం గంటిని.

విదు— అది యింతవఱకు జరగలేదు. ముం దేమగునో ? ఒక్కొక్కప్పుడు స్వప్నములు భావికార్యమును సూచించుచుండును.

కృష్ణ— మామా ! విచారింపకుము. అట్టిపని యేలజరుగును ? జరుగుఁగాక! నాకేమి భయము ?

గీ. వినిన వినవచ్చు వినకున్న వినకపోవ
వచ్చుఁగా కిస్సిరో ! మనవాఁడు కొల్వు
వెడలిపోవు నె యీరీతి వెఱ్ఱియగుచు
ననుచు వగచుచునుంటి ధరాధినాథ !

గాంధా— (మూర్ఛదేఱి) నాథా ! యేమి యీకోలాహలము !

ధృత— దేవీ ! నీకొడుకు చేసిన వేఁడుకుపని.

భీష్మ— ఆంబికేయ ! గడచినదానికి వగచినఁ బనిలేదు. కలియుగము ప్రవేశించినది. యుద్ధంబు కాక మానదు.

ధృత— దేవీ ! నీ వొకసారి మరల సుయోధనుని రప్పించి చెప్పిన విను నేమో?

గాంధా— మహారాజ! మొదటినుండియు దురాత్ముఁడగు వానికి రాజ్యమిచ్చిన దానికిఁ దగిన ఫల మనుభవింపఁ బోవుచున్నారము. వాని దుష్టచేష్టలకు మనమే కారణము. రాజ్యప్రదానము సులభముగాని దుష్టకార్యనివర్తనము గష్టము గదా ! పలువుర పరిహాసమునకుఁ బాత్రులమైతిమి. అయినను నాయోపినకొలఁదిఁ జెప్పెద.

ధృత— (విదురునితో) నీవేగి 'మీయమ్మ పిలుచుచున్న' దని సుయోధనునిం దోడ్కొని రమ్ము.

విదు— చిత్తము. (పోయి దుర్యోధనునితోఁ బ్రవేశించుచున్నాఁడు.)

దుర్యో— (వచ్చి) తల్లీ ! నమస్కారము. నన్నుఁ బిలిపించిన పనియేమి ?

గాంధా— తండ్రీ ! దుర్యోధన ! సహోనుజుండ వగునీకు శ్రేయస్కరంబగు నీతండ్రిమాటలు వినుము. గాంగేయకుంభసంభవకృపాచార్యవిదురాదులు నీక్షేమముఁ గోరనివారు కారు. ఐశ్వర్య మదృష్టమూలము గాని బుద్ధిసాధ్యంబు గాదు. జితేంద్రియుండును మేధావియుఁగాని వానికిఁ బ్రజాపరిపాలనము సుకరంబుగాదు. నీకుఁ గామక్రోధములు శత్రువులు గాని పాండవులని తలంపకుము. మొదట నీవారికే యిష్టుండవు గానిచో రిపుల కెట్లసాధ్యుండ వగుదువు ? కన్నులు దెగిన వలలోఁ జేఁపలు చిక్కని పగిదిఁ గామక్రోధములచేఁ దూంట్లు పడిన మహీపతివలలో శత్రువులు చిక్కరు. కావున రిపుషట్కంబు జయించి రిపుపంచకంబని తలంచుచున్న పాండవులతోఁ గలసి నీరాజ్యము సుఖముగాఁ బాలించుకొనుము. కుటుంబకలహమునకు జంకి కదా మీతాతయుఁ దండ్రియు వారిభాగము వారికీయఁ దలంచిరి. నిష్కంటకముగఁ బృథివియంతయు నేలఁదలఁచితి వేని వారడిగిన ట్లయిదూండ్లయిన వారికిమ్ము. నాయుపదేశము పిష్టపేషణప్రాయమని యెఱింగియుఁ గన్నకడుపు గావున మరలఁ జెప్పుచుంటిని. మీయందును బాండవులయందును సమప్రీతిగల శాంతనవాదులు తమ యావచ్ఛక్తితో సమర మొనర్పకుండుటయే నిక్కము కాన బంగుమరణంబున కొడిగట్టకుము.

దుర్యో— తల్లీ ! ఐశ్వర్యం బదృష్టసాధ్యంబయి మరణము మాత్రము బుద్ధిసాధ్యమగునా !

ఉ. పాండవులైన నుండవలె భారతవంశము నిల్ప లేక యే
ముండవలెన్ ; ద్వదీయసహితోక్తికి నిక్కము మాఱువల్కు లు
బ్ధుండఁ గుటుంబనాశకుఁడు ధూర్తుఁడఁ బుట్టితి సైఁపు మమ్మరో !
భండన మాచరింతు బలవంతపుదీవన యిచ్చి పంపుమా.

(నిష్క్రమించును.)

విదు— మహారాజ ! విచిత్రవీర్యనందన !

గీ. సభ్యులకు నెల్ల సెలవిచ్చి సరసిజాక్షు
నంపకము చేసి నిజగృహాభ్యంతరంబు
నకుఁ జనుఁడు భావికార్యంబునకు వగచుచుఁ
దొలఁగి చనె రాజు క్రమ్మఱఁ గొలువుమండి.

ధృత— నాయనా ! జనార్దనా ! దగ్గఱకు రమ్ము. (కౌఁగిలించుకొని)

క. సుతుల నొకనూఱుగురఁ గాం
చితి జగముల నీడు లేని సిరి వెంచితి యే

గతి కానున్నదో ! మామం
జితివిధి పాండవులచేతఁ జేయించెదవే ?

చ. కడుపెదుబిడ్డలం గనియుఁ గాలము తీఱిన వార్ధకంబునం
గొడుకులనెల్లఁ బాసి తమకొంపకుఁ గూటికిఁ జేరు బన్న మే
ర్పడినను బ్రాణగొడ్డములు పల్కక మాదెసఁ గీడు గొంతితోఁ
గొడుకులతో సహింపు మని కోరితి నంచు వచింపుమా హరీ !

కృష్ణు — మామా ! అట్లనఁబోకుము. నీ కొడుకులు మాత్రము బలహీనులా? కుంతి కే నీయింటికిఁ బొట్టకూటికయి వచ్చునవస్థ తటస్థించునేమో ?

మ. గెలువ న్శక్యమె ? కర్ణుఁ డేమి భుజశక్తిం జూడ సామాన్యుఁడే ?
బలవంతు ల్గురుఁ డాపగాతనయుఁ డశ్వత్థామ మున్నైన యో
ధులు నీపుత్రున కాజిఁ దోడ్పడక యెందుం బోదురే ! యాఁగినం
గల నాపింపఁగఁ జూచి రిందనుక పక్షంబున్న చందంబునన్.

ధృత — వాసుదేవ ! చక్రధారి వగు నీవు చక్రిరక్షకుండవై యుండఁ బాండవుల కేమి కొదవ ?

చ. సవసవగా శరంబులను జార్చెద రంతియ కాని వీరిలో
నెవరికిఁ జేతు లాడు వధియింపఁగఁ బార్థుల ? వారిలోనఁ గౌ
రవశతకంబు ఘోరసమరంబునఁ జిక్కినఁ జంపకుండఁగా
నెవరు పరిత్యజించి దయయెంతురు ? చెప్పుము నాకుఁ గేశవా !

కృష్ణు —

శా. లేదా ! యింత వివాదమేల ? యిచటన్ లేరా ? మహాప్రాజ్ఞు ; ల
య్యో ! దుర్యోధనుఁడింత దుష్టుఁడగునే ? యోగ్యేతరుల్వోలె మీ
రీ దుశ్శాసను శాసనంబు గొనఁగా నేమంత వచ్చెన్ ? విడన్
రాదో ! చంపఁగ రాదో ? దుర్మదుని నిర్మర్యాదు లోకార్థమై.

భీష్ము — (జనాంతికము) వాసుదేవా !

ఉ. చెప్పితి వీవు మే మురక చెప్పితి మేమి యొనర్తు మింక ? వా
తప్పులకుప్ప శోఁడు మన దారికి రాక తొలంగె వానికే
త్రిప్పులు తేవు సంధి యొనరింపమిచే మనబోఁటి వారికిన్
ముప్పు ఘటించె నీ చెడుగు మూలముగా యదువీర ! నేఁటికిన్.

అయినను గాలగతికిఁ దప్పవారమె ! కుప్పఁగూరలుగ రణశకునంబు లుప్పతిల్లుచున్నవి. మాకు సెలవిమ్ము. ధర్మము దప్పకుండఁ గర్ణధారుఁ డవై యీయోడ నడపింపుము.

సాత్య- (తత్తఅపాటుతో నిష్క్రమించి, ప్రవేశించి కృష్ణునితో జనాంతికము) అన్నా! ఇంతకు మున్ను దుర్యోధనాదులు చేసిన దురాలోచనమును నేను గనిపెట్టితిని. నీవు కడు జాగరూకుండవై యుండవలయును. నిన్ను సభ నురుఁగకుండఁ బట్టుకొని బంధింపవలయునని యోజించుచున్నారు. (చేతఁజూపి) అందులకు సూచకముగా నదిగో! సుయోధనునియొద్ద నొక రజ్జువున్నది కనుఁగొనుము.

కృష్ణు- (అలక్ష్యభావముతో జనాంతికము) తమ్ముఁడా! అవుఁగాక, నన్ను వీరేమియుం జేయఁజాలరు. సంశయింపకుము.

సాత్య— (జనాంతికము) అన్నా! అట్లని యొప్పరికింపం జనగు.

ఉ. ఏ నొకరుండఁజాలఁగల నిచ్చటి గుష్టులకెల్ల; నింకఁ బై
పైనరుదెంచు సేనఁ గృతవర్మ వధింపఁగలాఁడు ద్వారమం;
దానరసింహుతోడ నిది యంతయుఁ జెప్పితి నందు నిల్పితిన్
వీని వధించి నేఁడె పృథివిన్ మనపార్థుల కిత్త మగ్రజా!

దీనికి భీష్మద్రోణకృపాశ్వత్థామలును సమ్మతించునాగే. ఇందుల కేమందువు?

(అంతఁ గర్ణ శకుని దుశ్శాసనులు పగ్గములు చేతఁబట్టుకొని వేఱు వేఱు దిక్కులనుండి ప్రవేశింతురు.)

కృష్ణు— మన మిప్పుడు వీరిని వధింపరాదు. దానికిం గతము సావకాశంబుగా వచించెద. నీ వూరక చూచుచుండుము. వీరలెల్లరుఁ బటాపంచలై పోవు నట్లొనరించెద.

సాత్య— (సన్నద్ధుఁడై యుండును.)

భీష్మ— (తేటపాటుఁజూచి తనలో) ఔరా! చేటుకాలము! ఈధార్తరాష్ట్రాగ్రజుండు మున్ను తా నన్న దుస్తంత్రమెల్ల నడిపించు చున్నాఁడు. కానిమ్ము, ఎవఁడు త్రవ్వుకొన్న గోతిలో వాఁడే పడుఁగాక!

క. పదిలక్షలు కర్ణులు తోం
బదిలక్షలు శకునులును నృపాలకు లొకయ
ర్బుదముం గదిసినఁ గృష్ణుని
పదరేణువ చాలు లీలఁ బరిమార్పంగన్.

సాత్య— (సంరంభముతో) ఓ విదురగాంగేయాది నీతిధురంధరులారా! ఇది వినుఁడు.

చ. అదె కనుగొండు దుర్మదు లహంకృతిశాలులు కౌరవుల్ సుధు
ర్మదు లయి యగ్గిపై నుఱికి మ్రగ్గెడి కీటము లట్టు లన్నఁ బ
ట్టుఁబ మని రొయించి పొంచుచుఁ గడుంగడు నక్కుచునున్నవారు చ
చ్చెద రిదె వీరలెల్లరు నిసీ! యనిరోయుచుఁజూచుచుండఁగన్.

(కర్ణాదులు వేఱువేఱుగా నిష్క్రమింతురు.)

విదు — (అదరిపడిచూచి) అన్నా! వైచిత్రవీర్య!

మ. శిశుపాలాంతకుఁ గంసమర్దను ద్విపత్సింహున్ మహోరంహు దు
ర్దశపాల్గాఁగఁ దలంచి నీసుతులు గాంధారేంద్రుతోఁగూడి స
ద్యశునిన్ గట్టఁ గడంగినారు, విలయంబై పోవు నీనాఁడె యీ
పశువుల్ హేతువుగాఁగ నీకులము విధ్వస్తంబు నీనాఁడె యౌ.

ధృత — (నిశ్చేష్టుఁడై యుండును)

కృష్ణు — (భీష్మునిదిక్కు) తాతా! మదున్నదీనందన!

శా. నాపైఁ గోపముఁ బూని నీమనుమ లున్మాదంబుమై వచ్చునా
టోపం బెంతయు నొప్పఁగాక ననుఁ గట్టుంగాక రారాజు; మే
లే! పోని మ్మొక సుంత యాజ్ఞ యిడు మీ, వీగోపాలుండు దా
నాపన్నుం డగునో! మహేశమగునో! యాద్యంతంబు వీక్షింపుమా!

ధృత — (తత్తఱపాటుతో) తమ్ముఁడా! తత్క్షణము నీ వరిగి యయ్యవినీతుల
నెల్ల నిక్కడికిం దీసికొనిరమ్ము.

విదు — (నిష్క్రమించి దుర్యోధనాదిసహితుఁడై ప్రవేశించును)

కుమారా! యేమి యీదుర్నయము?

మ. అనుజుల్ నీవును గూడి చావఁగఁ దలం పావిర్భవం బందెనే?
దనుజారాతి నెఱుంగమే? యతనిపై దర్పంబు వాటించెదే?
చెనఁటీ! యెక్కడిమండగం బిది! యశక్తి ప్రాణమానాపహం
బనఘాత్ముం డతఁ డగ్గలేని భువనం బల్లాడి చల్లాఱదే?

విదు — గాంధారేయాప్రథమ! నామాట కొంత యోజింపుము.

క. ఎంద ఱెదుర్కొని యేగతి
నందిరి? శ్రీకృష్ణుఁ డనఁగ నందఱితో నె
న్నం దగుమనుజుఁడె? చెడిపో
వం దలఁ పూనకుము గోడువడకుము వృథగా.

కృష్ణ— (దరహాసముతో) బావా! ధార్తరాష్ట్రాగ్రజ! యిటు చూడుము.

ఉ. ఒక్కనిఁ జేసి నన్నిచట నుక్కడఁగింప దలంచినావె? నే
నెక్కడఁ బోఁగలాఁడ? నిఁక నిక్కడఁ జిక్కితిఁ బక్కనైవడిన్
దిక్కితి నీకుఁ, ఒట్టు మొగిఁ దక్కను, మిట్టిటు చేర రమ్ము, బల్
చక్కని యూహ ఫట్టె, ననుజన్ములతో నరుదెమ్ము పార్థివా!

(అట్టహాస మొనర్చును.)

(దుర్యోధనాదులు కృష్ణునివంకఁ జూడలేక కనులు మూసికొని యతి భయముతో గడగడ వణఁకుదురు.)

కృష్ణ— ఆ.వె. దివ్యదృష్టి యొసంగితిఁ దేఱిపాఱఁ
జూడుఁ డనఘాత్ములైన సంశుద్ధులెల్ల
నిది నిజమ్ము నిజాకృతి యిదియ ముక్తి
దము తపస్వులకును వదాన్యులకును.

(మునులును భీష్మవిదురద్రోణులును నానందపారవశ్యము నటింతురు.)

ధృత— (తనలో) శ్రీహరి తననిజరూపంబు ప్రదర్శింపంబోలు! అక్కటా! యీపాపాత్మున కిది దర్శింప రాదు గదా? అయినను నడిగిచూచెదఁ గాక. (ప్రకాశము)

క. దేవా! దేవరయడుగులు
భావించి కనుంగొనంగ వాంఛించెద నీ
సేవకుఁడ నాకు దర్శన
మీవే! యీవేడ్క దొరకు టేవేళఁ గదే!

కృష్ణ— నీకును దివ్యదృష్టి యొసంగితిని కనుఁగొనుము.

ధృత— (తేఱిపాఱఁజూచి)

చ. ఒకట నజుండు, నొక్కయెడ నుగ్రుఁ, డొకంటను విష్ణుఁ, డొక్కచో
సకలసురల్, మఱొక్కయెడఁ జంద్రదినేంద్రులు, నొక్కెంట భూ
పతుల, మొకంట యాదవులుఁ, బాండవులున్ గనుపట్టుచున్న వా
రకట! యిదేమిచోద్యమొకొ! యద్భుత మీతనిరూప విన్యాసమున్.

(అంజలి ఘటించి) దేవా! విశ్వరూప!

మ. ఇలయాగ్నిప్రభ లెల్లడన్ వెలిఁగెడిన్ విశ్వేశ! విశ్వాత్మ! కో
టులుఁగల్ దీనికి దీటుగాఁడగ మహా! వీక్షింపఁగా నేఁడు నీ
వెలుఁగన్ సర్వసుపర్వపూర్వహములు పృథ్వీభారనిర్వాహ! వా
మ్ముల సైరింపఁగదయ్య! దుష్టమతులన్ మూఢాత్ములన్ దేవా!

(ఆశ్చర్యముతోఁ దనలో) ఏమీ! వాసుదేవుండు నా ప్రార్థనము నున్నించి సర్వలోక భీషణంబగు తన విశ్వరూపము నుపసంహరించి నాఁడే. (నలుదెసలు పరికించి) ఈమహామహు నీక్షించిన యీదృష్టితోఁ బాపపుఁబ్రపంచ మేల చూడవలెను. (ప్రకాశము) వాసుదేవా! మహానుభావ!

మ. ద్రుహిణాదుల్ గనలేని నీదయిన చిద్రూపంబుఁ గన్గొంటి నే
బహుపాపాత్మకుఁ డైనపుత్రుకతనన్; భావత్క మా రూపమున్
రహి నీక్షించిన కన్నులన్ బరుల నర్వాంబౌనె వీక్షింప? నీ
వ హరింపన్ నీ విడిన దివ్యజ్ఞానమున్ గేశవా!

కృష్ణు— మామా! నీ వెట్లభిలషించితివో యట్లే యయ్యెడుఁగాక!
(భీష్మాదులదిక్కు)

శా. మేలున్ గీడును జెప్పి చూచితిరి మీ ర్కృమియ ఘాశ క్తి తోఁ
డాలం బందె కుతూహలంబు గలవాఁడై యుండె మున్మాటికిన్
గాలుం డాఁకొనియుండఁ బోలు! నెప రాఁగన్ జాలువారింక? నా
కేలా యిచ్చట జాల? మాజ్ఞ యిడుఁడా! యిందున్న వారెల్లరున్.
(లేచును)

(భీష్మాదులు వెంబడిని లేచి నిల్తురు.)

కృష్ణు— (ప్రయాణోన్ముఖుఁడై కొంతవఱకు నడుచును.)

(దుర్యోధనాదులు సాగనంపుచు నిష్క్రమింతురు.)

కృష్ణు— (భీష్మద్రోణులదిక్కు) నాకు ననుజ్ఞ యిండు.

భీష్ము— మంచిది. నాకీవిచారము మాత్రము బాధించుచున్నది.

క. గురులకు భక్తుఁడు శాంతుఁడు
నరుఁడు నిరతసత్యవాది నానాసుగుణ
స్ఫురణుండు వానితోడన్
దుర మొనరుచుకన్న నొండు దుఃఖము కలదే?

ద్రోణు— వాసుదేవా!

ఉ. నాకరుణావిశేషమ ధనంజయునిం బొనరించె సర్వలో
కైకధనుష్మదగ్రణిగ, నర్జునుతో నెవఁ డేని జాలఁ, డ
ప్రాకృతమూర్తి శాంతమతి వానియెడన్ బ్రియ మగ్గలంబు సూ!
నా కొమరుండుఁ గాఁడటులు నాకుఁ బ్రియుం డెటు నేతు నాలమున్?

కృష్ణు— ఏమిచేయుదుము. అతనికిని నిదియె సంశయము. కాల మనివార్యము.

భీష్మద్రోణులు— (నిష్క్రమింతురు)

కృష్ణు— (పరిక్రమించి నలుదెసలు పరికించి) ఈనిని నగరికఱ కంపి కర్ణుఁడు తన యవసథమునకు నేగుచున్నాఁడు; కావున నితనితో మాటలాడుట కిదియే తగినసమయము.

(కర్ణుఁడు ప్రవేశించును)

కృష్ణు- (కర్ణునిఁ జేసన్న చేఁ బిలిచి) రాధేయ! ఏకతంబుగ ముహూర్తమాత్రంబు నీతో మాటలాడ నాకవకాశ మొసంగుదువే ?

గీ. ఎల్లి సూర్యోదయంబున నేగువాఁడ
నిట వసించెద విదురునియింట మాపు
ఈ పటకు వత్తువో ? లేక యింటికేను
వత్తునో ? యానతీఁగదవయ్య కర్ణ !

కర్ణు— (తనలో) ఇతఁడు నా జననరహస్యముం గూర్చి మాటలాడఁగలఁడు (ప్రకాశము) తప్పక నీ వరుగుసమయమునకు వచ్చి కలసికొనియెదను.

కృష్ణు— మంచిది. (ఉభయులును నిష్క్రమింతురు.)

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వరులచే రచింపఁబడిన
పాండవోద్యోగమునందుఁద్వితీయాంకము.



ఓం.

శ్రీమత్పరదేవతాయైనమః.

# పాండవోద్యోగము



## చతుర్థాంకము.

(కుంతియుఁ గృష్ణుఁడును బ్రవేశింతురు.

కృష్ణు— అత్తా! ఇఁక నాకు సెలవిమ్ము. కౌరవసభావిశేషములన్నియు వినిచితి గదా!

చ. బవరము దాయవచ్చెఁ గురువంశ మడంగుట నిశ్చయంబు పాం
డవబలమే జయించు నన నావశమా! గురుఁడాది యైన యో
ధవరులతో నెదుర్కొన సుధాకరశేఖరుఁడైనఁ జాలఁ, డా
హవ మొనరింపఁగా వలయునా? వలదా? వివరించి తెల్పుమా!

క. కొడుకు కొడుకులుఁ గోడండ్రుఁ గొడుకు లీవుఁ
గూడికొని పోయి పెనుగొండ గుహాలలోన
దాఁగి యుండుఁడు బ్రదుకఁగాఁ దలఁతురేని,
బ్రతికియుండినఁ దినవచ్చు బలుసుఁగూర.

కుంతి— దేవకీనందన! నీ తల్లిచతురిమయంతయుఁ జూపించుచుంటివి. నామనోగతం బెఱుఁగఁ దలఁచికాని నీవెఱుఁగవే? కొండగుహలలోనే యుందురో! ప్రాసాదమందిరంబులలోనే యుందురో! సుక్షత్రియు లనిపించుకొనుటయే నాతలంపు. కుంతిభోజునకు దత్తపుత్త్రినై చతురదధివేలావలయితంబగు ధరామండలం బేలిన పాండుభూపాలునకుం బత్నినై బలవంతులని పేరుగాంచిన యేగురుకొడుకులకుఁ దల్లినై దాయాదులయింటఁ బదుమూడేఁడులు కుడుచుచు బ్రదికియుండుటకంటె వనంబులలోనుండుట తక్కువగాదు. అయినను నిర్భాగ్యురాండ్రకుం దార్కాణగాఁ గుంతి నొనర్పవలదనియుఁ గార్యాలోచనంబుపట్లఁ బాంచాలిని గారవింపవలసినదనియు ధర్మరాజుతో నొక్కివక్కాణించి నేనింతకుమున్ను వచించినవిదులాసం

వాదంబెల్ల బోధించి యెవనిజన్మము శాత్రవగర్వనిర్వాపణాసమర్థమో యట్టి పుత్రునిగన్న తల్లి యొకతల్లి గాదని నేనన్న ట్లుపదేశింపుము.

కృష్ణు— మంచిది నీవు నిలువుము.

(కుంతి నిష్క్రమించును.)

కృష్ణు— (పరిక్రమించి) ఏమీ ! కర్ణుఁడు రాడయ్యెనే ?

తే. గీ. అన్నమాటకుఁ దప్పు డెట్లైన వచ్చి
తీరవలెఁగాని వేఱొండుతీరుగాదు

(ఎదుటచూచి)

సూర్యుఁ డుదయించె నదిగో ! తత్సుతుఁడు కర్ణు
డరుగుదెంచెడిఁ దాను మున్నన్నపగిది.

(కర్ణుడు ప్రవేశించును.)

కృష్ణు— (కర్ణునిం దనచేతులతో దగ్గఱకుఁ దీసికొని) బావా ! నీకొక పరమ రహస్యంబు వినిచెద సావధానముగ వినియెదవా ?

కర్ణు— (చిరునవ్వుతో) నీ సంబోధనమువల్లనె తెలియుచున్నది. అయినను దెల్పుము.

కృష్ణు— తే. గీ. కన్నెప్రాయంబునందు భాస్కరుని కరుణఁ
బది నెలలు మోసి నినుఁ గన్నపడఁతి కుంతి,
చేరఁగాఁ దీసి నిన్నుఁ బెంచినది రాధ,
నీవు రాధేయుఁడవు గావు నిశ్చయముగ.

నీ వెఱుంగని ధర్మశాస్త్రంబులు లేవు. కానీనునకును సహోఢునకును దల్లిని బెండ్లియాడినవాఁడె తండ్రియని చెప్పుదురు. కావున ధర్మరాజాదులవలె నీవును బాండవుఁడవే. దుర్యోధనుఁడు సంధికొడంబడఁడని యెఱింగియు నీయుదంతంబుఁ దెల్పి దోడ్కొనిపోఁదలంచుటయే నారాకకుం బ్రథమకారణము.

ఉ. అంచితులైన బందుగుల యందఱిముందఱఁ జెప్పి నిన్ను మె
చ్చించెదఁ, గుంతిచేత రవిచేత నిజం బని నీకు సాక్ష్య మి
ప్పించెద, ఫల్గునప్రముఖవీరులు గొల్వఁగ నెల్ల భూమి యే
లించెద నచ్ఛకీర్తివిమలీకృతసర్వదిగంతరంబుగన్.

గీ. మాతృపక్షము మేమెల్ల మమ్ముఁ జూడు
మనఘ ! పితృపక్షము యుధిష్ఠిరాదు లెల్ల

వారిఁ జూడుము నావెంట వారికడకు
రమ్ము మీయమ్మ యలర రాజ్యమ్ము గొమ్ము.

మఱియు నీకు ధౌమ్యులు వేదోక్తంబుగఁ బట్టాభిషేకంబు నెఱపు నట్లొనరించెద.

మ. వ్యజనంబుల్ ధరియించు ధర్మజుఁడు, దీప్యచ్ఛత్రముం బట్టు వా
యుజుఁ, డశ్వంబులఁ దోలుఁబార్థుఁ, డభిమన్యుండంకమందుండు, భూ
ప్రజలెల్లన్ జయవెట్టి నీకు జరుగున్ బట్టాభిషేకంబు భా
నుజ! మాదేవియులు ద్రౌపదేయులును నేనున్ యాదవు ల్వెంటరాన్.

ఇదియును గాక యొక్కవిశేషంబు చెప్పెద నాలకింపుము.

ఉ. ఏసతి వహ్నిలోన జనియించెను జన్న మొనర్చువేళ మ
న్నేసతి పెండ్లినాఁడు నృపులెల్లఁ బరాజితులైరి క్రీడిచే
నేసతిమీఁదిమోహమున నింతలు చేసిరి రాజు నీవు; ని
న్నాసతి పెండ్లియాడఁ గల దాఱవభర్తగ సూర్యనందనా!

కర్ణు. వసుదేవకుమారా! నాయందలి సౌహార్దంబున శ్రేయస్కామివై తెలిపిన యీరహస్యము నా సహజకవచకుండలంబు లింద్రున కిచ్చునాఁడు సూర్యుని వలననే కొంచె మెఱింగితిని. నీవలన సమూలంబుగాఁ దెలిసెఁ గాని—

ఉ. సూతునిచేతికిం దొరకి, సూతకళత్రముపాలు ద్రావి, యా
సూతునియన్నముం గుడిచి, సూతకులాంగనయందు నందన
వ్రాతము గాంచి నేఁటి కొక రాజకుమారుఁడ నంచుఁ దెల్ప నా
చేతము సమ్మతించునె? యిసీ! యెవ రేగతి సిగ్గుమాలినన్.

క. లాలాస్వేదాదులఁ దా
నోలిన్ భరియించి నన్ను నోమినతల్లిన్
శీలవతి నంత్యకృతికిన్
బా లొనరింపకయమున్నఁ బాడియె విడువన్?

ఉ. కామముచేతఁ గాని, భయకంపితచిత్తముచేతఁగాని, యీ
భూమి సమస్త మేలుకొను పూనికచేతనె గాని నేను నా
నేమము గోరి చుట్టముల స్నేతుల న్విడనాడి నేఁడు మ
త్స్వామి సుయోధను న్విడిచి వత్తునె? వచ్చిన మెత్తురే జనుల్?

చతురుదధివేలావలయితం బగు నీధరామండలంబున కంతకుఁ బట్టము కట్టుకొందమను వేడుకయును నాకు లేదు.

శా. నా నేస్తంబును నాబలంబు మఱియు న్నా పెంపు లోనమ్మి యే
భూనాథుండు దిటంబుగా రిపులతోఁ బోరాట మాసించె, నా
భూనాథు న్విడనాడఁగా దగునె? రేపో మాపో చా నుంటి మే
నానం జెప్పెద నింతమాత్రమున నేలా యిట్టి వా దచ్యుతా?

గీ. "అర్జునుం డోడుఁ గర్ణున కనుచు జంకి
పన్నె నీపన్నుగడ" యంచుఁ బ్రజలు నిన్ను,
నన్ను "సూతసుతుండు పాండవుఁడ నంచు
రోయ కేగె" నటంచు దూఱుదురు కృష్ణ!

పదుమూఁడు సంవత్సరములనుండి సుయోధనుండు పేరుగా నేకచ్ఛత్రంబుగ నీభూమండలం బంతయు నేనే యేలితిని. కావున విషయసుఖంబులమీఁది యాసయుఁ దీఱిపోయె. కాకున్నను యింకొక విశేషంబు గల దాలకింపుము.

ఉ. నాదుహితంబు గోరియె జనార్దన తెల్పితి వింతవట్టు, వా
రాదృతిమై ననుం గనుట యబ్బురమే భవదాజ్ఞ? రాజ్యసం
పాదన మే నొనర్చినను పార్థివుఁ డాధృతరాష్ట్రసూతియే
కాఁ దగుఁ గాని యే నగుట కల్ల; భటుం డెటు లేలి కన్యుఁడిన్?

నాకెట్లును రాజ్యార్హత లేదు. నేను దన కగ్రజుఁడ నని తెలిసినచో ధర్మమూర్తి యగు యుధిష్ఠిరుండు రాజ్యం బొల్లక పరిత్యజించుట నిక్కువము. అట్లు జరుగుట లోకులకే కాదు నాకుఁగూడ నసమ్మతమే. ఏమంటివా?

గీ. నిత్యసత్యవ్రతుం డన నెగడు ధర్మ
తనయుఁడే నేల నేలఁగఁ దగినవాఁడు
కురుపతిని గెల్తు రే నెఱుంగుదును నిక్క
వముగ నీదయచేతనే పాండుసుతులు.

మ. అరయన్ నేరనివాఁడఁ గాను విను కృష్ణా! యుద్ధయజ్ఞంబొగిన్
జరుగున్, దానికి హోత యర్జునుఁడు; స్రుక్సంపత్తి గాండీవ; మ
క్కురురాట్సైన్యమదంబ యాజ్య మగుఁ, దక్కుంగల్గు సర్వంబు నే
ర్పరి వీవే ఘటియింతు వేత్తవును నధ్వర్యుండవున్ గావునన్.

తే. గీ. అఖిల మెఱిఁగియుఁ బార్థుల ననఘమతుల
నట్లు సభ నాఁడు నే దూఱ నాడు టెల్ల
నలసుయోధనుప్రియమున; కది తలంపు
వచ్చి నామన మ్మడ్డపు విచ్చి పోగులు.

ఇఁక నాకు సెలవిమ్ము. ధర్మతనయున కీయుదంతము తెలుపకుండ నాకు వరమిమ్ము.

కృష్ణు — (తనలో) ఔరా! యాతని మనోనిశ్చయము! (ప్రకాశము) వికర్తన కుమార! సర్వజ్ఞుండ వయ్యును దొల్లి రావణునిగతి ననుకరించుచున్నాఁడవు. నా కేవో కొన్ని ముఖప్రీతికరము లగు మాటలు చెప్పి సురిఁగి పోదలంచు చుంటివి కాని నీకుఁ బూర్తిగా జయాభిలాష కల్గియున్న దనుట నేఁ గనిపెట్టితిని. ఈమాటఁగూడ విని యరుగుదువుగాక.

శా. సేవాధర్మము గాన రాజ్యమును శాసింపంగ నేఁ జాల నం
చీ వాదన్ జనునయ్య? ఊనికయి యెందే నేగి యార్జించునా
శ్రీ వాలింపఁగ రాని కొప్పఁ జను, నీశ్రీ యేను నీకిచ్చు న
ప్డేవాఁ డాధృతరాష్ట్రసూతి గొనఁగా? నేమందు నీమాటకున్.

ఉ. వట్టిభిభీషికల్ సలుపువైఖరి గా దిది; భీష్ముఁ దొట్టి మి
మ్మెట్టులనేని బట్టి వధియించుట నిక్కువ; మట్టిసూచనల్
పట్టుఁగఁ బార్థులందుఁ గనుపట్టుచునున్నవి వేనవేలు, నీ
చెట్టతలంపు మాని దయసేయుము ధర్మజునొద్ద కొప్పఁగన్.

తే. గీ. అరిగెఁ గృతమును త్రేత ద్వాపరము జరిగె
నిట్టి కదనంబుఁ బార్థునియట్టిజోదు
నెందు నేరును జూచి మున్నెఱుఁగ రన్న
పగిదిఁ దెలియంగఁ బడుఁ జుమ్మి మగుడు మిటకు.

క. ఈవే కారణ మింతకుఁ
జావవు నీవొకఁడవే విశాంపతు లెల్లన్
నీవలన మ్రందుదురు నీ
సేవాధర్మమున కేమి? చెడు జగ మెల్లన్.

కావునఁ బిదప విచారించిన లాభముండదు. మున్నే మేల్కొనుము. మాటాడకుము.

కర్ణు— నందనందనా! నీవాక్యంబులం దొక్కటియుఁ బ్రత్యాఖ్యానంబొనర్పఁ దగినది లేదు. సర్వమును నీ వనినట్లే జరుగును. ఇంత గుఱుఁ దెఱిఁగిన నీకుఁ గర్ణునిమనోనిశ్చయము మాత్ర మగోచరమగునా? అట్లెఱిఁగియు నన్నేల నిర్బంధించెదవు?

చ. ఇపుడు తటస్థమైనపృథివీంద్ర మహాప్రళయంబుపట్ల భూ
మిపతియుఁ దమ్ముఁడున్ శకుని మిత్రుఁడు నల్వురు వీరు కారకుల్

కపటము లే దొకింత యిటఁ; గౌరవనాశన సూచనల్ నిజం
బపరిమితంబుగాఁ గనఁగ నయ్యెడు నాకును నేమి సేయుదున్.

మ. మన మప్పార్థులవంకకున్ జనదు కర్మం బెట్టిదో! సారె చె
ప్పిన లాభం బిఁక లేదు, కీర్తిన్ కయి పృథ్వీనాయకుల్ పోరి చ
చ్చినఁ జాని, విస్మృది భారతావనికి సుశ్రీ దెచ్చి దృష్టాంతమై
చనుఁగా కెల్లెడ మేటిసత్కవుల వాచాశుద్ధికిన్ మూలమై.

కృష్ణు— (నైరాశ్యమును సూచించుచు)

గీ. పృథివి నాశనము సమీపింపఁ బోలుఁ
గానిచో నానుడుల్ మది నూననేర
నంతటనికృష్ణుఁడే కర్ణుఁడు?(తలపంకించి పెదవి విఱిచి)అగువినాశ
కాలమునఁ జెడ్డ మంచిగాఁ గానుపించు.

కర్ణు— (వినియు విననియట్లు నటించి) బావా! వసుదేవనందన!

క. సకలక్షత్రియుల వినా
శకమగు నీసమరభరము సడలినపైఁ దీ
రికమై నిను దర్శించెద
నాకో! స్వర్గమునందుఁ జూతు నాకో! లేకున్నన్.

నాకాజ్ఞ యొసఁగుము.

కృష్ణు— మంచిది.

(కర్ణుఁడు నిష్క్రమించును.)

కృష్ణు— (తనలో) ఇఁక సంగర మెట్టును దప్పదు. యాపచ్ఛక్తిని వినియోగించితిని గావున నన్ను లోకులు నిందింపరు. (పరిక్రమించి వెనుకఁ జూచి యోజించి) అవునవును. కుంతి యొకసారి యీతనికి నిక్కము బోధించినచో నితని పెట్టి కుదురునేమొ? (పెదవివిఱిచి) వినఁడు.

క. జనని వచించిననిక్కము
జనకుఁడు వచించినను "యశమె చచ్చుటగా" త
క్కిన నితర మితఁ డొల్లఁడు
కనుఁగొనఁ బ్రాణంబు తృణము గా దీతనికిన్.

కానిమ్ము. ఇచ్చట సభావిశేషములును విశేషించి కుంతి బోధించిన నీతులును ధర్మజాతున కెఱింగింతుఁగాక! (నిష్క్రమించును)

కుంతి.— (ప్రవేశించి తనలో) అకటా! నే నేమిసేయుదును? కర్ణుఁ డర్జును నిచే మడిసినను, నర్జునుఁడు కర్ణుచేఁ దెగినను నా కొకవిధమైన దుఃఖమే; కావున నెట్లేనిఁ బోయి బోధించి పాండవులం జేర్తుఁగాక! (యోజించి)

ఇది గాక యితఁడు తప్ప దుర్యోధను సేనలోఁ బాండవుల కపకృతి చేయఁ దగు పేరు గల యోధు లంతగా లేరు. భీష్మద్రోణకృపాశ్వత్థామ లెన్నఁడును నా సుతులయెడఁ బ్రేమ దప్పి వర్తింపరు. కావున వీని నెట్లేని ద్రిప్పి సుఖ ముండెదఁ గాక! (పరిక్రమించి) అదె భాగీరథీ తీరమునఁ గృతస్నానుండై నా యగ్రతనూజుఁడు సూర్యోపాస్తి యొనరించుకొనుచున్నాఁడు. (సమీపించును.)

కర్ణ— దేవీ! అతిరథసుతుండును రాధేయుండును నగు వసుషేణుండు నమస్కరించుచున్నాఁడు.

కుంతి— (కౌఁగిలించుకొని) తండ్రీ! నీవు కౌంతేయుండవు గాని రాధేయుండవు కావు. కుంతిభోజునింట నేను గన్నెనై యుండి దూర్వాసుం డొసంగిన వరంబు పరిశీలింప దివాకరుం దలంచిన నతని ప్రసాదంబు నాకు నిన్ననుగ్రహించె. నేనును గౌలీనంబునకు జడిసి నిన్ను గంగాజలంబుల విడిచితిని. సహజంబులగు కవచకుండలంబు లుండు కతంబునఁ దండ్రికంటె వేయిమడుంగులు కాంతియందు మిన్నయై యున్న నిన్ను వదలిన మహాపాపాత్మురాల నగు నా యపరాధంబు మన్నించి నీ తమ్ములతోఁ గలసి రాజ్య మేలుకొనుము.

(ఆకాశమునందు)

చ. నిజము కుమార! కుంతికి జనించినమాట నిజంబు భాస్కరా
త్మజుఁడవు తల్లి చెప్పినవిధంబునఁ జేయుము రాజు లందఱుం
బ్రజయు ముదంబు నొందఁ గురుపాండవయుద్ధము మానిపించి ధ
ర్మజునకుఁ బ్రీతి గొల్పి యసమానయశోభరముల్ వహింపుమా!

కర్ణ— పాండుమహిషీ! ఏను గుంతీనందనుఁడ ననుమాట నీవెకాక యాకాశవాణికూడ స్పష్టపఱచెఁ గదా! అయినను,

ఉ. కూటికి గుడ్డకై పరులకొంపకుఁ జేరి త్రయోదశాబ్దము
ల్నాటిన దుఃఖము ల్మది కలంపఁగ నుంటివిగాని "యిట్టి దీ
మాట" యటంచుఁ దెల్పితివె మానిని! యాత్మహితంబుఁ గోరి యీ
నాఁటికిఁ జెప్పవచ్చితివి నాపయిఁ బ్రేముడి కల్గుపోలికన్.

ఉ. ఇంచుకయైన లోఁ గరుణ యెంచక కన్నకుమారు గంగ క
కర్పించిన గొడ్డురాల వీకఁ బ్రేముడి యెక్కడిదమ్మ నీకు? నా
యంచిత మైన రాచకొల మాఱడివుచ్చితి సూతధర్మము
లొంచితి వీటఁబుచ్చినకులం బిఁక వచ్చునె? సంధిఁ జేసినన్.

పంచపాండవులనుమాటను వేఱుచేయుట నాయభిమతముగాదు. అదియునుంగాక,

ఉ. చిన్నతనంబునుండి దయచేసి రమావిభవం బొసంగి నా
యున్నతిఁగోరి నాపయి జయోద్ధతిఁ బూన్చిన రాజకన్న నా
కన్నలుఁ దమ్ములుం గొడుకు లాప్తులు నెక్కువ కాదు, వాని దీ
యన్నువప్రాణి, వాని విడనాడుట నాపని గాదు మానినీ!

కుంతి— కుమార! పంచపాండవు లనుమాట వేఱుచేయుట నాయభిమతము కాదంటివే! కానిమ్ము. అట్లే నాకు వర మిమ్ము.

కర్ణు— పాండవజననీ! నీ యభిమతం బొసంగితిని. నీ వచ్చిన కార్యము సఫలమాయెఁగదా! యిఁక జనుము.

గీ. సమరమునఁ జేతఁ బడినను జంప నేను
ఫల్గునుఁడు తప్పఁ దక్కిన పాండుసుతుల
నేను మడిసిన నున్నవా రేగు రందు
రతఁడు మడిసిన నాతోడ నైదుగురము.

కుంతి— (తనలో) అర్జునుఁడు వీనిచేతఁ జిక్కువాఁడు కాఁడు. (ప్రకాశము) కుమారా! ఉపపాండవు లేవురపైఁగూడ దయ యుంచుము.

కర్ణు— కురుకులవధూమణీ! ధర్మపుత్రాదులతోఁ గలియుమనుట తప్పఁ దక్కిన నీ యభిమతమ్ము లన్నియు నెఱవేర్చెదను.

క. హరితో నరుదెంచెడి నరు
నరసి భయంబంది నట్లె యప్పార్థులతో
నరుదెంచెడి నన్నుం గని
పాఱఁబోరి నవ్వుదురు శత్రుభూపతు లెల్లన్.

(నిష్క్రమింతురు.)

గద్య.

ఇది శ్రీ ... తిరుపతి వేంకటేశ్వరులచే రచింపఁబడిన
పాండవోద్యోగమునందుఁ జతుర్థాంకము.



ఓం.

శ్రీమత్పరదేవతాయైనమః.

# పాండవోద్యోగము

## పంచమాంకము.

(పంచపాండవులును శ్రీకృష్ణుఁడును బ్రవేశింతురు.)

ధర్మ— కృష్ణా! వసుదేవనందన!

ఉ. ఇంతకు మున్న నీనుడువు నెల్లవిశేషము లాలకించితిన్
జింత నశించె నాహవము సేయఁ దలం పుదయించెఁ గౌరవ
ధ్వాంత మడంచి భూపతిపదంబు వహింపఁగ నిచ్చ పుట్టె స
ర్వాంతము కాక తీఱ దకటా! యెవ రాఁగఁగలారు దైవమున్?

భీము— అన్నా! దైవ మేమి చేసె? అన్నిటికిని నక్కురుకులపాంసనుం డగు సుయోధనుఁడే కారణము.

ఉ. వానిమదం బడంచి బలవంతుల నైరుల నెల్లఁ ద్రుంచి మున్
బూనుప్రతిజ్ఞలన్ నెఱపి భూమికి నిన్ బతిఁ జేసి యయ్యర
ణ్యాని వసించుచున్ గుడిచినట్టి మహావ్యథ లెల్లఁ గల్లగా
మానవతీలలామ కభిమానము నిల్పెద యాజ్ఞసేని

(పటాక్షేపమున నొకపురుషుఁడు ప్రవేశించును.)

పురు— దేవా జయము! జయము! తమ యాజ్ఞానుసారమున స్కంధావార మెల్లఁ జూచి వచ్చితిని. ఇరువాఁగును సర్వసిద్ధముగా నున్నారు. మఱి యొక మనవి. కురురా జెందులకో గాని యులూకు నిచటి కంపుననువార్త నొకఫణిహారివలన వింటిని. ఇంతట నంతట నతఁడును రావచ్చును.

కృష్ణ— నీవు పోయి యాఫణిహారి నిట కంపింపుము.

పురు— చిత్తము. (నిష్క్రమించును.)

ఫణి— (ప్రవేశించి) జయము జయము.

భీము.— కౌరవసేనయందలి విశేషము లేమి ?

— సుయోధనుఁ డడుగఁగాఁ గురువృద్ధుఁ డగు గాంగేయుం డుభయసేనలం
దును నతిరథమహారథనిర్ణయ మొనరించునప్పుడు—

అర్జు.— ఏమి జరిగెను ?

ఘణి.— కర్ణు నర్ధరథులలోఁ బరిగణించెను.

కర్ణ.— ఈవిషయమునఁ దాతగారిదే లోప మనక తీఱదు.

తే. గీ. ఆతఁ డర్ధరథుండైన నన్యుఁ డెవ్వఁ
డతిరథ మహారథాఖ్యల నందువాఁడు ?
తాతగా రేలొకో ! యంత చేయఁగాని
వానిఁ గాఁ గర్ణు నెంచి రవమానకలుని.

కృష్ణు— ఓయీ ! అర్జును నేతరమునఁ బరిగణించిరి ?

ఘణి— క. "నరుఁ డితరమున వాఁడని
తరమే పర్కింప నతనితన వారలఁడై తా
నరయంగ లేఁ డనిన నొం
డొరు లెవ్వరు నిర్ణయింతు రుర్వీస్థలిలో."

అని చెప్పిరి.

అర్జు.— తాతగా రీయెడ సూతపుత్రుని మాత్రమే కాక నన్నుఁగూడఁ బాత్రగా
నవమానించినారు.

క. పార్థుఁడఁట ! కర్ణుతోఁ దా
నర్ధరథునితోడఁ బోరునఁట ! యని మింటన్
స్వర్ధాము లాడు పలుకులు
వ్యర్థమనోరథుని జేయవా ! నన్నాజిన్.

కృష్ణు— దానికేమి ! ఈపటినుండి నిన్నెదుర్కొనువా రందఱును నతిరథ మహా
రథ సమరథులే యగుదురా ?

క. కొందఱు మహారథులు మఱి
కొందఱు సమరథులు మఱియుఁ గొంద ఱతిరథుల్
కొందఱు సర్ధరథులు నీ
సందడి కయ్యమున నుండురి జనవరు లందున్.

సహ.— అన్న తాత్పర్య మదికాదు. ద్వంద్వయుద్ధ మనునది సర్వవిధముల సమా
నులకే యేర్పడినది కాని, తదితరులకుఁ గాదు. కావున నిది విచార్యమే.

కృష్ణ— భద్రాత్రి! కర్ణు నర్ధరథులలోఁ జేర్చుటకు గాంగేయుం డేమి హేతువులు చూపెను?

ఫణి— ఇతని కింతకు మున్ను దటస్థించిన గురుశాపాదికము నుదాహరించి తన మాటలు దాను సమర్థించుకొనెను.

కృష్ణ— (ధర్మజునిదిక్కు) శాంతనవుని నిర్ణయము కడు న్యాయ్యముగానున్నది.

ఉ. అర్జునుఁడన్నచో శివుని యాహవముక్ జవిఁజూచినట్టి దోః
ఖర్జుఁడు నిర్జితాసురుఁ డఖండుఁడు; కర్ణుఁడు బాహుసంపదక్
దుర్జయుఁడైన నీయనఘుతోఁ దులయే! గురుశాపదగ్ధుఁ; డ
త్యూర్జితు లైననుక్ విజయ మొందరు నూ! గురుశాపదగ్ధులన్.

ధర్మ— ఏమైనను దాతగారి యశశ్చంద్రునం దిది యొక కళంకముగా లోకు లనుకొనక మానరని తలఁచెదను. (ఫణిహారిదిక్కు) కురుపితామహుఁడు తన్నర్ధరథులలోఁ జేర్చినందులకుఁ గర్ణుఁడు సమ్మతించి యున్నకుండెనా?

ఫణి— అతఁడేల యూరకుండును! తోఁకత్రొక్కిన త్రాఁచువలె నిట్టూ నిగుడించుచు "నోయీ! పితామహ!

మ. విను మే నర్ధరథుండ నైన నగుదుక్ వీరుల్ విచారింప నం
దునకు న్నిక్ గొఱగా వటంచు గడువృద్ధుం డంచు నిక్ ఱేఁడు మ
న్ననమైఁజూచి వినిర్ణయంపుఁబదవిక్ దార్కొల్పుటే తప్పు గా
వి, నినుక్ జెప్పు మటన్న యప్పు డగుఁగా! నీయిష్టమే యిష్టమై.

క. పీఁ డెట్టిఁడైన నగు నీ
పోఁడిమి యాలమున నడఁగ్గి పోవుదనుకఁ బో
రాడుటకు రాఁడు నీపస
చూడఁ గలరు వీరులెల్ల శూరమ్మన్యా!"

అని యస్త్రసన్న్యాసము గావించెను.

కృష్ణ— ఇది పునరుక్తి. అతనియస్త్రసన్న్యాసము మాట కేమిగాని,

ఉ. ముందుగ భీష్ముఁ డీల్గు నని మోఱకుఁ డీతనిపోక చెప్పె దీ
నం దెలియంగనయ్యె ఘటనందనుఁ డాపయి నీల్గు నంచు; మి
న్నందినవాఁడునుంబలె దురాగ్రహముక్ బ్రకటించు నీతఁడా
మ్రిందక యుండువాఁడు? సుగమం బశుభం బని తేలె వారికిన్.

ధర్మ— అగుఁగాక! సూతపుత్రుని దురాలాపమ్ములకుఁ దాతగా రేమనిరి?

ఫణి— అనుట కేమున్నది! తత్కాలోచితమ్ముగఁ దనకు జనించిన కోపా వేశమ్ము నెల్లఁ జిఱునవ్వుగా మార్చికొని "ఓయీ! రాధేయ!

చ. నృపతి సమీకభార మిది నెత్తిని మోపినవాఁడుగాన నీ
చపలత నీదునీచతయు సాఁగుటకున్ దతి యయ్యెఁ గానిచోఁ
దపతపలాడు నీపడుచు తప్పుడుపౌరుష మేమి యౌనో! వీ
ని పలితభావ మే మగునో నీ కెఱుఁగం బడకున్నె యింతకున్ ?

క. నీ వెంత నీకుఁ గల్గిన
చేవయు నది యెంత నీవు సేయుసహాయం
బావంత గాదు నాకు ము
దావహ మే నీవు రామి యాహవమునకున్.

ప్రతీహారి— (ప్రవేశించి) జయము ! జయము ! శకునిపుత్రుం డగు నులూకుండు
వచ్చి యున్నవాఁడు.

ధర్మ— శీఘ్రముగఁ బ్రవేశపెట్టుము.

ఉలూకుఁడు— (ప్రవేశించును.)

ధర్మ— (చేతఁ జూపి) ఆ యాసనము నధిష్ఠింపుము.

ఉలూ— (కూర్చుండి)

మ. వినుమా యోయి ! యజాతశాత్రవ ! మహావీరుండు దుర్యోధనుం
డనుపంగా నిట కేగుదెంచితి నతం డాడంగ శాసించి పం
చినమాటల్ గల వొక్కకొన్ని యవియే చెప్పంబడున్ ధర్మనీ
సును బోనాడి వినంగఁబాడి యగు నీసోదర్యులున్ నీవునున్.

ధర్మ— దూతవై వచ్చిన నీపైఁ గనలుటకు నే నేమి సుయోధనుఁడ ననుకొంటివా ! నీధర్మమును నీవు సంపూర్ణమ్ముగ నెఱవేర్చికొన వచ్చును.

క. చేయఁ గలకార్య ముండినఁ
జేయన్ వలె ధార్తరాష్ట్రు శిక్షింపవలెన్
న్యాయముగ రణమునం ద
న్యాయముగా వొక్కొ ! దూతవగు నిను నొంపన్.

ఉలూ— దానికేమి ! యది విచారణాంతరము. పరికృత మనుసరింతను. నా
మొగమున సుయోధనుం డనిపినపలుకు లివి.

చ. "పలుపుప్రతిజ్ఞలన్ నిలుపఁ జాలఁ బ్రియత్న మొనర్పుఁ డూరకే
పలికిన లేదు లాభము సభాసదు లందఱు మున్ వినంగ నీ
వలలుఁడు ప్రేలె నాతొడలు వ్రచ్చెద నంచును దుస్ససేను ప్రే
గులు మెడఁదాల్చి శోణితము గ్రోలెద నంచును జ్ఞప్తియున్నదే ?

(ప్రత్యేకించి పాండవులను వేలఁ జూపుచు)

ఉ. జోగితనాన నొక్కరుఁడు సూఁడుగా నొకరుండు పేడియై
బోగపువిద్దె నేర్పుచు నపుంసకతాధర మూని యొక్కఁడు
ద్యోగము వాజిశాలఁ గొని యొక్కఁడు ; వేఱొకఁ డాలమందలో
బాగతి యాఁడిగంబు గొను బాలిశులొక్కొ ! ననుఙ్ జయించుటల్.

ఉ. ఎవఁడు పితామహుఙ్ దొడరు నెవ్వఁడు ద్రోణు నెదుర్చు నెవ్వఁడా
హవవిధిఁ గర్ణునోర్చు నెవఁ డాఁగుఁ గృపు న్గురుపుత్రుతోడఁ దా
నెవఁ డని సేయునో ? సరిగ నిప్పుడ చొప్పడ నేర్పరించుకొం
డవల విచారమంది ఫల మందరు ఈ పని ముందుఁ డందఱున్."

(భీమాదు లొకరిమొకము లొకరు చూచుకొనుచుఁ గోపావేశము నటింతురు.)

కృష్ణ— (నివారించును.)

ధర్మ— ఇంకను జెప్పు మనిన వున్నవా సమాప్త మయ్యెనా ?

ఉలూ— కలవు పచించుచున్నాఁడను. అప్పుడే నీతమ్ములకు నాపై నాగ్రహ
ముదయించుగుఱుతులు కనుపట్టుచున్నవి. ఇంక ముందు వీరు బొత్తిగా
వినఁ జాలరు కదా !

అర్జు- (చిఱునవ్వుతో)

శా. బావా ! నీపయిఁగోప మేమిటి కహో ! బ్రహ్మాస్త్రముఙ్ దీయునే
యేవాఁడేనియుఁ జాటకైరముపయిఙ్ హేయాతి హేయంబు గా
దే ! వీరుం డటు చేసినఙ్ ; కడమ సందేహంబు లేకుండ వా
చావైదగ్ధ్య మెలర్పఁ జెప్పి కురురాజప్రీతి సంధింపుమా !

ఉలూ— (తనలో) అర్జునునిమాటలు నాకుం బోటులకన్న మిన్నలై నాటుచు
న్నవి. అయినను నిందుఁ గోపంబు కర్తవ్యంబుగాదు. ధర్మ జాంకుశంబు
నకుఁ దక్కిన మూడు గజమ్ములును లొంగినట్లు భీమమత్తేభంబులొంగదు.
(ప్రకాశము) శేషము నాలకింపుఁడు.

ఉ. "ఈ రొక రాజపుత్రకులరేని ధ్రువంబుగ నాజి నిల్చి మీ
బీరము చూపుఁ డర్జునుని పెద్దధనుస్సును వాసుదేవు నే
మారసి భాగ మిత్తు మని యాత్మఁ దలంచితి రేపెం ! భీష్మునిఙ్
జేరిన యుత్తరక్షణమ చేరెడిఁ గవ్వడి కాలుప్రోలికిన్.

మ. సభలోఁ బెండ్ల మనాథపోల్కి వగవఙ్ శౌర్యంబుఁ జూపింపలే
ని భవాదృగ్రిపుసంతతిఙ్ రణములో నే నెట్లు సంధింతు ? శూ

రభువుల్ తాదృశకాలమందుఁ దమధైర్యస్థైర్యగాంభీర్యసా
ర్వైభవంబుల్ ప్రభ దక్క నమ్రముఖులై భీషింపు పాటింతురే ?

(భీమాదులు మరలఁ దలలు పంకించుచుందురు)

(కృష్ణుఁడు మరల వారించును.)

ధర్మ— (తొందఱగా) అయినదా? యింకను నుడువవలయునా ? న్యాయము లేదు. దూతవుగదా ! తుట్టతుదవఱకుఁ గానిమ్ము.

ఉలూ— ఇఁకఁ గొంచెము మాత్రమె యున్నది వినుఁడు.

ఉ. "మాయలమారి, కొంపలను మాపు నుపాయము లెన్ని యెన్నియో
సేయఁ గలాఁడు కృత్తు లనిసేయఁగఁ బన్నినవాఁడు మా కృష్ణుం
డే యిఁక మీకు దిక్కగుఁ; గృష్ణులు జిష్ణులు రెండు రెండు నీ
మాయలు పన్నినన్ జయము మా కుదయింప దెఱింగి యుండుఁడికన్."

అని సూత్రప్రాయముగా మీ యెల్లరకుం జెప్పు మనిరి.

భీమ— (పండ్లు పటపట గొఱికి మండిపడి) ఓయీ! దుర్ద్యూతకేళిలోలక ! కాపురుషపర్యాయాఖ్యక ! ఉలూక !

ఉ. దూతవు గాన నీపలుకుదుండగముల్ సయిరించినాఁడ, నీ
నేత మదంబడంచునెడ నీవును దండ్రియు గ్రుడ్లనీటితోఁ
జూతురుగాక యప్పటికె శూరుఁ డెవండును మిమ్ముఁ జంపి దు
ర్ద్యూతము దుంపఁ ద్రెంపి జముప్రోలికిఁ దోలక యూరకుండినన్.

ధర్మ— తమ్ముఁడా ! యొరులకు బోధించుటకు బదులు నీవే కోపపడిన నింకఁ గవలా సైరించువారు ?

కృష్ణ.— (భీమునిఁ దనసేనకకుఁ దీసికొని సకోపస్మితముతో) గాంధారరాజతనూజ ! మీ శకునితో నా మాటలుగా వచింపుము.

ఉ. చావు ధ్రువం బటం చెఱఁగి చావుము శూరులు మెచ్చునట్టు; లీ
చేవ రణాంగణంబు దయ చేసినయప్పుడు చూపు టొప్పుఁ గా
కీవిధి నూరకే మెఱుఁగ నెవ్వరు నవ్వరె ? చివ్వ యొల్లియే
కావున దత్తఱంపడుట కర్జమె ? గర్జలు దుర్జయంబులే ?

మ. ఇఱుగన్ బెట్టుట నిక్కమే యెఱుఁగు మూర్విరనాథ ! నీయాఁడువుల్
సరిగాఁ గాపొనరించుకొమ్ము మనుజక్ష్మస్సీమ కాత్రేయ కా
క్షురధారన్ విదళించి శోణితము నాస్వాదించు నీభీముఁ; డె
వ్వరు మాన్యుం గలవారొ వారి నిపుడే ప్రార్థించి కాపెంచుమా !

ఉలూ— (తనలో) ఈమాటలు విని యూరకుండుటకన్న మానికిఁ జావు కడు మేలు గదా! దీనికంతకును నెల్లి రణమ్మున నాయస్త్రశస్త్రములే ప్రత్యుత్తరం బొసంగుఁగాక! (ప్రకాశముగా) నేనిఁక నరుగవచ్చునా?

ధర్మ— ఇదిగో! నరుగుదువు గాని- ఎవఁడురా! అక్కడ? చందనతాంబూలాంబరాభరణాములఁ దీసికొని రమ్ము. ఈగాంధారరాజతనూజుం గౌరవింపవలయు.

భటు— (తత్సహితముగాఁ బ్రవేశించును.)

ధర్మ— (అవి యిచ్చి గౌరవించును.)

ఉలూ— (పరిగ్రహించి ప్రయాణోన్ముఖుఁ డగును)

అర్జు— ఓయీ! కవ్వడి యిట్లు చెప్పె నని మీరాజునకుం జెప్పుము.

శా. వా రున్నా రని వీర లుండి రని దుర్వారంపుగర్వోక్తులన్
నో రారన్ వ్యయ మేల చేసెదవు? నిన్నున్ బట్టి గాంగేయునిన్
బోరన్ జంపక మాన, మల్లె గురులన్ బోకార్తు, మామీఁద ని
స్సారున్ గర్ణుని దోలు టెంతపని? వాచాశూరునిన్ భీరునిన్.

ఉ. వీర లవధ్యు, లందు గురుపీఠుఁడు భీష్ముఁ డవధ్యుఁ, డందులో
ధీరుఁడు కుంభజుం, డతనిదీటగువాఁడు తదాత్మజాతునో
స్సార మపార, మల్లకృపుశౌర్య మవార్య, మటంచుఁ బొంగెదో
సారసనేత్రుఁ డండటని జక్కఁగఁ జెట్టఁ గలాఁడు లేఁడొకో?

క. ఒరులభుజసారమే కద
శరణము నీ! కాత్మబాహుశౌర్యౌదార్య
స్ఫురణంబు సున్న, నీకై
కురువృద్ధున్ గూల్పవలసె గురువృద్ధులతోన్.

ఉలూ— (కోపమడఁచుకొనుట నటించుచు నిష్క్రమించును.)

ధర్మ— (కృష్ణునితో) బావా! వసుదేవనందన!

క. మును రుక్మి విరూపునిగా
నొనరిచి రుక్మిణిని గొన్నయుక్తిపరుఁడ వీ
వని తో డఁటె! నీరూపుని
గను నరి నొనరించి లక్ష్మిఁ గైకొనలేమే?

భీము— బావా! మహానుభావ!

ఉ. ఏడుచుఁ జుమ్మి యోఁడు; తనయొట్టెదుటన్ సహజుల్ దనూభవుల్
పోఁడిమి దక్కి యాలమున బూడిద పాలయి పోయి సైన్యముల్

గూడ నశించి తాఁ బిలువఁ "గో" యను లెంకయు లేక సర్వమున్
గాడయి తోఁచినప్పుడు వికావికలై యెద తల్లడిల్లఁగన్.

కృష్ణ — ఇంతయును నీభారతరణమునకు సూచనయే. అమాయికుఁడవగు నీనోట వెలువడిన యక్కరములే నిక్కము గాకున్న మాయికుఁడగు భగవంతుని మాటలు వేదములా నిక్కములు?

చ. ఎవఁడు దురాగ్రహమ్మునఁ బయిం బడుచెట్టఁ దలంపఁ బోక కా
డవు ననుచింత సుంత మది నానఁగ లేక కృతఘ్నతాగతిన్
దవిలి మహోపకారు లగుతమ్ముల నన్నను ధిక్కరించె న
య్యవినయపుంగని నైజుపఁడా! భగవంతుఁడయో! సుయోధనున్.

ఆ. వె. నాఁడు ఘోషయాత్రఁ బోడిమి చెడి చచ్చు
వాఁడె కాఁడె! తాను బాండవాగ్ర
జుం డమాయికుండు సుంత తమ్ముఁ డటంచు
బలిమిఁ జేసి పార్థుఁ బంపకున్న.

ప్రతీహారి— (ప్రవేశించి) జయము! జయము! రుక్మియను విదర్భదేశాధిపతి దర్శనమునకై వచ్చియున్నాఁడు.

ధర్మ— (కృష్ణునితో) బావా! యేమనియెదవు?

కృష్ణ— (చిఱునవ్వుతో) శీఘ్రముగ రమ్మనుము.

ప్రతీ— (నిష్క్రమించును)

రుక్మి— (ప్రవేశించును)

ధర్మ— (సగౌరవముగా) ఆయాసన మలంకరింపఁబడుఁగాక!

రుక్మి— కూర్చుండుట కేమి! కూర్చున్నను గూర్చున్నట్లే కూర్చుండకున్నను గూర్చున్నట్లే! (అర్జునుదిక్కై)

చ. విజయుఁడ! నన్ను నీవెఱుఁగవే! విజయ మ్మనువిల్లు నాది, మూఁ
డు జగము లేక మైనను జెడున్ జాము వ్రేల్మిడి దానిచేత; నీ
గజగజ కొంత నేను విని కయ్యమునన్ గెలిపింప వచ్చితిన్
బుజములతీఁట వోఁగ రిపుపుంజముఁ ద్రుంచెద నిన్ భరించెదన్.

చ. భయఁపడి తీర్థయాత్రకు నెపం బిడి పోయెను పెద్దగొల్ల; నీ
కయి యితఁ డెట్టులో యనికినైన చనుదెంచినవాఁడు గాని యే
మి యగును? నిట్టిగొల్లల కమిత్రులు జంకరు, జంకితేని ని
శ్చయముగఁ జెప్పు మే ననికి సాయముఁ జేసెద నిన్నుఁ గాచెదన్.

భీము— (మండిపడి గదఁ గైకొని) అరే, కృతఘ్నా ! యేమంటివి ?

క. ఈకృష్ణుఁడు నీశిరముఁ
బోకార్పఁ దలంపఁ గరుణ పొంపిరివో నిన్
జాకుండఁ జేసినందుల
కా ! కృతముఁ మఱచి కాఱు లఱచెద విట్టుల్ ?

తే. గీ. మూఁడు లోకమ్ము లేకమై మొనయుఁగాక
యలహలాయుధునకు భయమనఁగ నెట్టి ?
దోయనాత్మజ్ఞ ! గురుదూషణోక్తి కొక్క
మాఱు సైఁచితి నిఁక నొక్కమాఱు సెఁప.

కృష్ణు - (వారించి) ఏమీ ! నీకీ వెఱ్ఱికోపము.

క. పిచ్చుకపై బ్రహ్మాస్త్రము
పుచ్చెడి వెఱ్ఱులును గలరె ముసలాయుధ నీ
పిచ్చివెఢంగెదియో యన
నచ్చునె లోకులకు వీనినాలుకయె చెడుఁ.

ఒక్కమాఱుకాదు పదివేలసారు లన్నను నీ వీతనిపైఁ గనలకుము. నే నెందులకు మిన్నకుంటినో సుంత విచారింపుము.

భీము— (ఆవేశముతో) నీవు రుక్మిణిం దలఁచి యన్న నొక దేబె నిందించినను విని సైరింతువుగాక !

మ. గురునిందన్ విని శిష్యుఁ డెవ్వఁడును శక్తుం డైనచో నాజడున్
దురితాత్ముఁ బరిమార్ప కుండిన గురుద్రోహంబు వాటిల్లు, నె
వ్వరు వారించిన నాఁగఁ డీతఁడు, రణప్రారంభ మం దీ దురు
ద్ధరుఁ జంపి గురుప్రియమ్ము ననుసంధానింతు ముమ్మాటికిన్.

రుక్మి— (తనలో) ఇతని దురుక్తులు విని సైరించుట కడు భరముగానున్నయది. వీఁ డొక్కఁడే యైనచో నాకు జంకఁ బనిలేదు గాని తటిదైనచో

వీరందఱును నాపై కుఱుకవచ్చును. (విననియట్లు నటించును)

అర్జు— అన్నా ! గురునింద వినఁగూడదని నీవు నొడివినపలుకులు కడు లెస్స పలుకులు. అయినను నితఁడు మనకు సహాయం బొనరించుతలఁపున వచ్చి

నవాఁడు గావున నితనిని వధింప నుద్యమించుట యిహపరలోక చూఁత
మగుఁ గాన సైరింపుము. (రుక్మిదిక్కై)

చ. ఎఱుఁగవె? జ్ఞప్తి లేదె? తల నిప్పటికిన్ గలవేమొ నాఁటియా
సురెనెఱగంట్లు, గడ్డమును జుట్టును మీసలు నాఁడునాఁటికిన్
బెరుఁగును గాని యేరికిని బీరము దాఁ బెరుఁగంగఁ బోదు నీ
తరము నెఱుంగఁ జాలరని ధర్మజుతమ్ముల నాత్మనెంచితే?

చ. అరులకు నేను భీతి వడినప్డుగదా! కరుణించి నీవు మా
ర్తురఁ బరిమార్పఁ గాఁ గడఁగి తోడుగ వత్తునటంటి తప్పెఁజా!
తరుణము, నాఁడు ఖాండవము దగ్ధమొనర్చెడి పట్టునందు న
వ్విరటునకై పెనంగునెడ విస్మృతమయ్యె భవత్ప్రతాపముల్.

నీయిచ్చ వచ్చినకడకుఁ బోవచ్చును. నీసాయము మాకుఁ గాఁ
బట్టదు.

క. కలఁ డిటఁ గృష్ణుం డని, సి
గ్గులచే టని, తెలియ వకట! కొంకక నోరె
ట్టులు వచ్చిన నట్టులొకో
పలుకుట యాలోచనంబు వలవదె రుక్మీ?

రుక్మి— (తనలో) నే నిప్పుడ పోయి సుయోధను సైన్యాధిపత్యమ్ము వహించి
వీరాడిన పల్లిదమ్ములకెల్ల భల్లములనె యుత్తరం బిచ్చెదఁ గాక. (యో
జించి) అతఁడుఁగూడ నన్ను వలదు పొమ్మనునేమో, అగుఁగాక!
యేమైనను "నేను పాండవులకు భయపడినవాఁడ నన్నుఁ గాపాడు"
మని యతఁడు నన్నుఁ బ్రార్థించిననే యంగీకరింతును గాని లేనిచో
నంగీకరించుట యసంభావ్యమే.

(నిష్క్రమించును.)

(తెరలో)

శా. జన్యాయాతపరశ్శతానుగతరాజన్యాయుతాధీశమూ
ర్ధన్యత్వప్రతిపాదకంబులు నగారాల్ మ్రోయఁగాఁ జొచ్చె భ
త్రిన్యాయంబునఁ బత్తు లార్చుచు ధరిత్రీజాతముల్ సేరె న
నోన్యాంబున్ దెస లాడుమాట లన సైన్యారావ మొప్పారెడున్.

తే. గీ. ఎల్లి యుద్ధం బటంచు వీ డెల్లయెడలఁ
జాటుచున్నారు పడవాళ్ళు స్వనము లెసఁగఁ
గృష్ణసారథికుం డగుజిష్ణు జేపు
చూతు మనుకొనుచున్నారు సురలు చదల.

(అందఱును నిష్క్రమింతురు.)

గద్య.

ఇది శ్రీ ... తిరుపతి వేంకటేశ్వరులచే రచింపఁబడిన
పాండవోద్యోగమునందుఁ బంచమాంకము.



ఓం.

శ్రీమత్పరదేవతాయైనమః.

# పాండవోద్యోగము



## షష్ఠాంకము.

(కృష్ణార్జునులు రథస్థులై ప్రవేశింతురు)

కృష్ణ— (కేలఁజూపి)

ఉ. కంటివె భీష్ము నల్లగురుఁ గాంచితె గౌతముఁజూచితే ద్విష
త్కంటక! ద్రౌణిమోముకళ గన్గొను మల్లదె! సూతపుత్త్రుఁ డో
క్కంటఁ గురూద్వహుల్ గలసి కయ్యపుముచ్చట లాడెడిన్ సఖా!
బంటులఁ బోటుమానిసులఁ బాఱఁగఁ జూడు మపారసంఖ్యలన్.

అర్జు— (అనుత్సాహమును సూచించుచు) జగన్నాథ! పరాత్పరావతార!

ఉ. కొందఱు బందుగుల్ గురులు గొందఱు గొందఱు తమ్ము లిందులో
వందను లొక్కకొందఱు గనం దగుపోణిమి నందువారు రా
జ్యేందిరకై వృథాగ మన మిందఱ మ్రుండఁగఁ జేసి యీక్రియన్
డెందము రాయిగా సిరి గడించుటకన్నను బిచ్చ మొప్పదే.

సీ. ఏమంచు వాలమ్ము లేయఁగాఁ గల నొక్కొ
కల నొక్కొ పెదతాతగారితోడ
గురువుతో నేమంచు గ్రుద్దులాడుదు నొక్కొ
యెద నొక్కొ-కింత కొం కొదవదొక్కొ
గురునకుఁ దరువాత గురుఁడైన కృపునితో
రిపునితోఁ బలె మోహరింతు నొక్కొ
ఇద్ధమైత్రీకుఁ డశ్వత్థామతో మామ
తో మద్రనృపునితోఁ దొడరుటొక్కొ

తే. గీ. పెద్దతండ్రికుమారుల పెద్దనిద్దు
రించుకయుఁ గొంచ కిలఁదు వీక్షించు టొక్కొ

బాహ్లీకాది మహాకురుప్రభులనెల్ల
భల్లముల నెట్లు డొల్లింపఁ జెల్లునొక్కొ !

కృష్ణు— (తనలో) ఈ భీష్మద్రోణాది గురుపరంపరయు బాహ్లీకాది జ్ఞాతిపరంపరయు నితని డెందమ్మున కిట్టి మందత నాపాదించుట యొక యక్కజము గాదు. (ప్రకాశముగా) అర్జునా !

ఉ. ఇంతకుమున్న గాదె ! నృపు నీవు రణమ్మున కాయితంబుగా
నెంతయు నొక్కి చెప్పితి, విదేమిటి కింతటిలోనఁ దావకో
దంతము మాఱె ! నన్నయును దమ్ములు సిగ్గఱరొక్కొ? నైరలీ
పంత మెఱింగి రేని గరువంబులు వక్కఱఁటయ్య ! కవ్వడీ.

ఉ. చంపెడివాఁడు గాఁడొకఁడు, చచ్చెడివాఁడును గాఁడొకండు దే
హంపుస్వభావ మియ్యది, భవాత్యయముల్ గనుమండు జీవుఁ డీ
తంపులమారికాయమును దద్దయు నమ్మ కసంగుఁడై మనుక్;
జం పొనరింపకే రిపులఁ జంపుము నీవు నిమిత్తమాత్రమై.

ఈరహస్యమును వినుము. (చెవిలో నేమో చెప్పును)

అర్జు— తత్త్వవిద్యోపాధ్యాయ ! వార్ష్ణేయ !

క. కులధర్మాతిక్రమణము
కలుషావహ మన్నమాట కడు శ్లాఘ్యమ యీ
యిలకొఱకై బంధుల నా
ర్యుల గురులఞ్ జంప నుల్ల మొల్లదు తండ్రీ !

ఉ. ఎందఱు రాజు లేలరి మహేంద్రమహావిభవంబుతోడ ము,
న్నెందఱు రాజు లేలుదురొ యేరికి శాశ్వతమెక్కొ ? దీనికై
బందుల వంశవృద్ధుల నృపాలుర నన్యుల దేశికాదులఞ్
ద్రమందఁగఁ జేయుపాపునకు మంచిగతుల్ పరమందుఁ గల్గునే ?

క. ఏ నొక నిమిత్తమాత్రమ
కాని ధర్మజాను లెల్లఁ గడతేతే రనం
గా నామది కెక్కదయది
స్తూనృత మెట్లొనొ తెలియఁ జూపు మనంతా !

కృష్ణు— (తనలో) ఇతనికీ సందియము విశ్వరూప ప్రదర్శనమ్మునం గాని నివర్తింపదు. (ప్రకాశము) అర్జునా ! ఒకసారి కన్నులు మూసికొని మఱి చూడుము.

అర్జు-- (అట్లొనరించి మహాశ్చర్యముతో)

ఉ. ఎన్ని మొగమ్ము లున్నవియొ యెన్ని భుజంబులొ యెన్ని రూపులో!
కన్నులె వెన్నియో! యకట కానఁగ వచ్చెడి భీతి హెచ్చెడిన్
జిన్నలుఁ బెద్దలున్ గలను జేయఁగ వచ్చినవార లెల్ల నా
పన్నులు గాఁగ నీ యనఘువక్త్రములన్ బడుచుండి రోలిమై.

దేవా! నాయజ్ఞానంబు నివర్తించినది. నీవు లోకక్షయకర్తవగు రుద్రుఁడవు కాని యాదవ పట్టభద్రుండవు కావు. నీచేఁ జంపఁ బడిన యీ భీష్మాదియోధులఁ బిష్టపేషణం బొనర్చుట నా యశంబునకుఁ గాని వేఱొండు కాదు. ప్రసన్నుండవై యీరూపం బుపసంహరింపుము.

(అని కనులు మూసికొని ధ్యానించి తెఱచును)

కృష్ణు— (చిఱునవ్వుతో) బావా! నే నెవ్వరు?

అర్జు.- (సిగ్గుతో) నీవు యదునందనుఁడవు, మాపాలిటి కల్పవృక్షంబవు, శిష్టరక్షణదుష్టశిక్షణపరాయణుండవు, లీలామానుషవిగ్రహుండవు, తత్త్వమసీత్యాది వాక్యబోధ్యం బగు నాగమమూలకందంబవు, నిన్నిదమిద్ధ మని నిర్ణయింప నే నెంతవాఁడను? బంధుత్వకారణమ్మున నాయొనర్చు నపచారమ్ముల నన్నిటిని క్షమించి ప్రకృతకార్యాయత్తుండవై నొగ లెక్కి మున్నిచ్చినవరంబు గరంబు నెఱవేర్పఁ బ్రార్థించెదను.

కృష్ణు— (రథము తోలుట నటించి దృష్టినించి) ఫల్గునా! అటు చూచితివా! మీయన్న నిరాయుధుండును నిస్తనుత్రాణుండును సాంజలిబంధుండును నై కౌరవబలమ్ములోనికరుగుచున్నవాఁడు. వెనువెంటన భీమ నకుల సహదేవ ధృష్టద్యుమ్నాది యోధులు ఱిచ్చపాటుతో నొకరి మొకము లొకరు చూచుచుం బోవుచున్నవారు.

(యథోక్తముగా ధర్మరాజు ప్రవేశించును)

అర్జు-- (ఱిచ్చపాటుతో)

ఉ. "ఈ నృపుఁ డింత బేలగునె! యిట్టిఁ డెటుల్ సమరావనీస్థలిన్
దా నడుగించె నిందులకుఁ దమ్ములు సమ్మతి నెట్లుచూపిరం"
చాననముల్ నిగుడ్చి నృపు లందఱు వ్రేలిడి ముక్కుమీఁద నెం
తేనియు సంశయాంబునిధి నీఁదఁగ నన్న యదేమొ యేగెడున్.

కృష్ణు — అందులకుం దగిన కారణము నే నెఱుఁగుదును. అజాతశత్రుండన సామాన్యుండుగాడు. ఈసంశయించు నృపాలుర కాతని మనోవర్తనంబు గుఱుతింప నలవికాదు. మనముగూడ నట కేగుదము రమ్ము.

(నిష్క్రమింతురు)

